# THE PROPHET AMOS

(DRAMATISED IN TELUGU)

# ఆమోసు

నాటకము

“కీడు [illegible] మేలు చేయుడి”

sult

“నీళ్లు పారినట్లుగా న్యాయము జరుగనియ్యుడి
గొప్ప ప్రవాహమువలె నీతిని ప్రవహింపనియ్యుడి.”

ఆమో. 5: 14, 24.

THE CHRISTIAN LITERATURE SOCIETY
FOR INDIA

MADRAS ALLAHABAD RANGOON COLOMBO

1925

# FOREWORD

THE beginnings of all drama are said to lie in religious festivities when through song and dance the chief episodes in the life of the gods were narrated for the pleasure and profit of the worshippers. In the middle ages too, the chief source of inspiration for the drama was in religion. Drama is said to have been employed to bring home, in an easily understood form, the events connected with the birth and the resurrection of our Lord.

If the middle ages needed this method of popular religious instruction, much more do we need it now for our own country. What more popular method can we conceive for conveying Christian teaching in an attractive form to the thousands of village Christians that have come into the Church as a result of Mass Movements?

The majority of our Christians have probably never heard of Amos. It is a question whether even any large proportion of our lay workers understand the place of Amos in the history of Israel. To all such this play will come as a great boon.

The idea of the play was taken from one written in English by the Rev. R. L. Pelly of the Bishop's College, Calcutta, but the setting the language, the style and the poetry all belong to our Telugu author.

By its pleasing style, resonant rhythm and plaintive poetry the play thoroughly captivates the listener. Its teaching too is of a very high order. To those who wish to have a popular exposition of the Book of Amos, to those who wish to provide an entertainment to their Christian people that will give them both pleasure and profit, at the same time and to those who wish to find an outlet to the dramatic powers of young men under the most healthy conditions, I can recommend this play most heartily.

May the message of Amos, with its stern call to righteousness here set forth through play and song, resound throughout Andhra land to the edification of all Christian people!

*February 24, 1925* V. S. AZARIAH DORNAKAL.

# గ్రంథకర్త ప్రస్తావము

ప్రవక్తయగు ఆమోసు చరిత్ర కలకత్తా బిషప్స్ కాలేజికి వైయిస్ ప్రిన్సిపాలుగా నుండిన రెవ. పెల్లీగారిచే నింగ్లీషు భాషలో రచింపబడి అక్కడి విద్యార్థులచే నాటకముగా నాడబడి ‹‹యంగ్ మన్ ఆఫ్ ఇండియా›› అను మాసపత్రికలో ప్రచురింపబడెను. పండితులు దాని నెక్కువగా గొనియాడు చుండినందున దోర్నకల్లు వేదాంత కళాశాలవారు దానిని తెనిగించు పుణ్యాముగట్టు[illegible]రి. దానియందలి కథా క్రమము మిక్కిలి మనోరంజికముగా నుం[illegible]టంబట్టి నాతరగతి విద్యార్థులకు దానిని నేర్పగోరితిని; నోటిమాటలతో నేర్పుటకన్న పాటలతో నేర్పుట ఎక్కువ ప్రయోజనకరముగ నుండునని తలంచి, పిల్లలు తరగతిలో బాడుచున్న రాగములలో దాని నిమిడ్చ నారంభించితిని. ఇట్లు చేయుటలో నా గురువులగు శ్రీ దోర్నకల్లు అధ్యక్షులవారు వేదాంత తరగతిలో నాకు నేర్పిన అనేక విషయములను దానికి జేర్చి, నా తరగతి విద్యార్థులకు తగినట్లుగా దాని గుదుర్చుకొంటిని. ఇదియైన పిదప పిల్లలా వచ్చియు రాని రాగములతోనే తెలియని తాళములతోనే మోటు మాటలతోనే దాని పాడి యాడు [illegible]నుచుండగా మద్గురువులవారది జూచి దానినంతను వ్రాసి యియ్యుమని నాకాజ్ఞనిచ్చిరి. గురునాజ్ఞ మీరవీలులేనందున నేను దానినంతను వ్రాసి శ్రీవారికి కృతజ్ఞతాపూర్వకముగా సమర్పించుకొనుచున్నాడను.

ఛందశ్శాస్త్రముతో బరిచయములేనివాడ నగుటచేతను సంగీతముయొక్క సంగతియే ఎరుగనివాడ నగుటచేతను నాకావ్యమందు తప్పులు కుప్పలు కుప్పలుగా కవీశ్వరులకు కనబడక మానవు. అయినను పసిబిడ్డలు వచ్చియు రానిమాటలాడుచున్నపుడు పెద్దలాగ్రహపడక నేర్పుతో వారిని దిద్దయత్నించురీతిని కవిపుంగవులు నాయందును దయగలిగి వర్తింతురని నమ్ముచున్నాడను.

దోర్నకల్లు<br>
ఎమర్జన్సీ క్లాస్<br>
24-2-25

ఇట్లు పెద్దలశరణుఁగోరి విరమించునది<br>
స. సా. సుబ్బయ్య.

# విషయసూచిక

# ఆటలో వచ్చువారు

## ఆమోసు

| | |
|---|---|
| సూత్రధారుడు | ధనికుడు |
| ఇద్దరు సాధువులు | ముగ్గురు న్యాయాధిపతులు |
| ఇద్దరు ప్రయాణికులు | ఇద్దరు కూలివాండ్రు |
| గిలాదువాడు | ఇద్దరు బంటులు |
| నలుగురు గొల్లలు | నలుగురు యాజకులు |
| ఇద్దరు వర్తకులు | అమస్యాఅను ప్రధానయాజకుడు |
| కానానువాడు | సేవకుడు |
| | సారాషాపువాడు. |

# సూత్రధారుని ఉపన్యాసము

క॥ శ్రీ కరుడగు తండ్రికి ధర
ప్రాకటముగ గొమరుడేసు ప్రభువుని కిలలోన్
ఏకంబుగ నాత్మకునే
నీ కరణింజేతు లెత్తి చేతును నుతులన్.

క॥ పెద్దలకుజేతు వందన
మొద్దికతో నాదరించ నీ సమయమునన్
దిద్దియు నా దోషము మీ
ముద్దుల బిడ్డనుగ గాచి మన్నించుటకున్.

శ్రీ మంతమై సర్వసంపదలకు నిలయమై వెలయు చున్న ఈ భూమియందు మహా ధన్యమైన ప్రాంతమేది యని యడిగిన నది పాలస్థీను దేశమేయని చెప్పి యొప్పుకొన వలసి యున్నది. లౌఖ్య విషయములలోనది యందుకు కొర గాని దానివలె గనబడినను పారమార్థిక విషయములలోనది మిగుల ప్రసిద్ధిగాంచియున్నది. ఎట్లన నది బహు పురాతన దిన ములనుండి భక్తులకు పుట్టి నిల్లుగాను, వేదమునకు ఉనికిపట్టు గాను, నిజమైన జ్ఞానమునకు నిలయముగాను వెలయుచున్నది. అందువల్ల ప్రపంచమునందది అతి పావనమై, మహా పుణ్యమై, బహు పుణ్యక్షేత్ర శోభితమై, సర్వ భక్తజన స్తోత్ర పాత్రమై, సమస్తయూద జన సేవితమై మహా ప్రఖ్యాతిగాంచుచున్నది.

ఇట్టి మహా పుణ్యక్షేత్రమగు పాలస్థీను గొప్పదిగానుండక దాదాపు 180 మైళ్ల పొడవును 50 మైళ్ల వెడల్పును గలిగి

చూపునకు చిన్నదిగా గనబడును. ఉత్తరమున నెత్తగు పర్వతము లును, తూర్పున నొక యెడారియు దక్షిణమున మరొక యెడారియు పడమర నొక సముద్రమును దీనికి సరిహద్దులుగా నున్నవి.

దేశములోపల దిగి చూచినప్పుడు అది సమముగా నుండక దక్షిణ ప్రాంతమువలెనే గుట్టలు మెట్టలు, కొండలు బండలతో నిండియుండును. దేశమిట్లు కొండప్రదేశమగుట చేత పంటలు మెండుగా పండవు. అందువలన నా దేశవాసులు ఆదికాలమునుండి యెక్కువగా మందలను మేపుకొని జీవనము చేయుచుండిరి. వృత్తి పశువుల కాపరి వృత్తియైనను వారిలో గొందరికి భగవంతుని యెడలగల భక్తి నిరుపమానమైనదై యుండెను. అడవిలో గొఱ్ఱెలను గాచుకొను పిల్లలు మొదలుకొని పొలమును దున్నుకొను పెద్దలవరకును ఒకానొకప్పుడు అసాధ్యమైన దైవభక్తిని జూపుచుండిరి. క్రీస్తుకు ముందు 8 వ శతాబ్దములో జీవించిన "ఆమోసు" అనునతడు అట్టివారిలో నొకడైయుండెను. అతడు యెరూషలేమునకు దాదాపు రెండామడల (20 మైళ్లు) దూరములోనున్న తెకోవ[1] యను పల్లెటి గ్రామమున నొక పేద కుటుంబమునబుట్టి పశువులను మేపుకొనుచు జీవనము చేయుచుండెను. జరుగుబాటు తక్కువైనందున అప్పుడప్పుడు కూలికిపోయి అడవిలో దొరుకు పండ్లు దండలుగా గుచ్చుకొని[2] కూలినాలి సంపాదించుకొని పొట్ట బోసికొనుచుండెను; గాని విశేష కాలము మందలను మేపుచు కాలము గడుపుచుండెను. అతడు పశువులను దోలుకొని అడ

---

[1] ఆమో 1: 1. [2] 7; 14.

వికి బోయినపుడు అడవిలో కూర్చుండి భగవంతునియొక్క పరిశుద్ధత, నీతి, న్యాయాది లక్షణములను దలపోయుచుండెను. అతడా విషయములను దలపోసిన కొలదిని అతని హృదయము దైవభక్తితో ప్రజ్వరిల్లుచుండెను. సత్యదేవుని యందలి వైరాగ్యము అతనిలో అగ్నివలె జేరి మండుచుండెను.

ఆమోను జీవించిన కాలమందు పాలస్తీను దేశములో పలుజాతులవారు కాపురము జేయుచుండిరి. సముద్రతీరమున ఉత్తర దిక్కున ఫెనీకేయు లనబడిన యొక జాతివారు వసించుచుండిరి. తూరు సీదోను అను రెండు రేవు పట్టణములు వారికుండెను. వారు సముద్రముపై ఓడ సబురులు చేయుచు వర్తక వ్యాపారముల యందారి తేరినవారై, చదువునందును, చేతి పనులయందును మిగుల ప్రఖ్యాతిగాంచి సిరిసంపదలతో తులదూగుచుండిరి.

దక్షిణమున ఫిలిస్తీయు లనబడిన యొక పెంకి జాతివారు సముద్రతీర మైదానములయందు కాపురము జేయుచుండిరి. వీరు ఉన్నత దేహులును పరాక్రమశాలులుగానుండి ఇశ్రాయేలీయులతో నిత్యము పోరాడుచు వారికి మానని ప్రక్కపోటుగానుండిరి.

ఇకను, తూర్పు దిక్కున అందరికి నుత్తరముగా అరామీయులును వారికి దిగువను అమ్మోనీయులు మోయాబీయులు, ఎదోమీయులు అను నాలుగు ముఖ్యజాతులవారును నివసించుచుండిరి. వారిలో నరామియులను వారు ఒకప్పుడు చచ్చిన కుక్కవలె పడియుండినను మరియొకప్పుడు జంగుబిల్లివలె చెంగున దుమికివచ్చి దొరికినంతమట్టుకు నోటకరచుకొని

పోవుచుండిరి. దమస్కు అను మహాపురము వారికి ముఖ్య స్థానముగా నుండెను.

వారికి దిగువనున్న గిలాదును దాటి వచ్చినయెడల అమ్మోను మోయాబీయులను జాతులవారు ఒకరికి దక్షిణముగా మరియొకరు కాపురము చేయుచుండిరి. వీరు లోతు సంతానమని లోకులు సామాన్యముగా చెప్పుట కద్దు. వీరు వద్దు వద్దన్నను ఇశ్రాయేలీయులతో తరుచుగా సంబంధ బాంధవ్యములను జేయుచుండిరి.

వీరికి దక్షిణమున ఎదోమీయు లనబడిన మరియొక జాతి వారు నివసించుచుండిరి. వీరు ఏశావు సంతతివారని యెల్లరును చెప్పుకొందురు.

మన కథ జరిగిన కాలమునందు చుట్టునుండిన ఈ జనాంగములవారు కాకులవలెజేరి, ఎప్పుడు గొడ్డుపడునా, ఎప్పుడు పొడుచుకొని తిందుమాయని కనిపెట్టినట్లు కాచుకొని యుండిరి. వారిలో ఫెనీకేయులు ‘‘బయలు’’ అను దేవతనున్ను, ఫిలిస్తీయులు ‘‘దాగోనును,’’ అమ్మోనీయులు ‘‘మిల్కోమును’’ మోయాబీయులు ‘‘కెమోషును’’ ఇట్లు ఒక్కొక్కరు నొక్కొక్క దేవతను బెట్టుకొని కొలుచుచు నొక అల్లరి మేళముగా నుండి, ఒక హద్దు పద్దులేక, భయము భక్తి లేక నీతిన్యాయములు విడచి, అడ్డము వచ్చిన అక్రమములకెల్ల నొడి బట్టుచుండిరి. ఈ సంగతులు అడవిలో దారిని వచ్చిపోయే వారి సంభాషణల ద్వారా ఆమోను చెవికి చేరుచుండెను. అవి యతనికి భరింపరాని మనోవ్యాకులతను గలిగించుచుండెను.

చుట్టునున్న అన్య జనాంగముల వారిట్టి స్థితిలోనుండగా మధ్యనుండిన ఇశ్రాయేలీయులైనను సన్మార్గులుగా నుండక పోయిరి. ఇంతకు బహు పూర్వమే వారి రాజ్యము రెండుగా చీలిపోయెను. ఉత్తర భాగము ఇశ్రాయేలు రాజ్యమని పిలువ బడెను. దానికి షోమ్రోను రాజధానిగానుండెను. దక్షిణ భాగము యూదా రాజ్యమని పిలువబడెను. దానికి యెరూష లేము రాజధానిగా నుండెను. ఉభయ రాజ్యములవారును నీతిపథమును విడిచి, పెడత్రోవలను ద్రొక్కుచుండిరి. అందు త్తర రాజ్యముయొక్క స్థితి మిగుల విచారకరముగ నుండెను. ఆ సమయమున రెండవ యారోబాము అను రాజు ఆ భాగమును పాలించుచుండెను. యుద్ధము లేవియు లేనం దున జనులు ద్రవ్యార్జనోపాయములను వెదకి ధనమును గూర్చుకొనుచుండిరి. ఎప్పుడైతే ధనము చేతజిక్కెనో అప్పుడే వారు సుఖభోగులైరి. ఎప్పుడు సుఖభోగులైరో అప్పుడే ఒళ్లు మరచిరి. దుర్మార్గము విస్తరించెను; దౌర్జన్యము మోపయ్యెను. బీదల బాధ అధికమయ్యెను; వీటికి తోడు బాహ్యారాధనలకూడ ప్రబలెను. బేతేలు అను స్థలమున నొక బంగారు దూడ నిలుపబడెను. జనులక్కడజేరి లెక్కలేని యారాధనలను యెహోవా పేరట జేయుట కారంభించిరి. ఇట్లు దేవుని జనులన బడిన వారేమి అన్యులేమి అందరును తమ యిచ్ఛానుసారముగా వర్తించుటకు చెలరేగిరి. తెకోవ గొల్లవాడైన ఆమోసు దీనిజూచి యూరకుండ లేకపోయెను. పరిశుద్ధుడైన దేవుడు ఇట్టి అక్ర మములనేమాత్రమును సహించడని యాతడు గాఢముగా నమ్మెను. దూరములోనున్న అష్షూరను రాజ్యమునులేపి దుర్మార్గుల

కందరికి తప్పక బుద్ధి చెప్పునని యూఢిగా నమ్మెను. కావున నికను తాను మౌనముగానుండలేక నావిషయములను దేశనివాసులకు మోమోటమిలేక బోధించుట కారంభించెను. అతడు దక్షిణ మునుండి ఉత్తరమునకుపోయి అక్కడ బహు ఖండితముగా నీ సంగతులను బోధించుచుండెను. శత్రువులడ్డగించినను ఆగ డయ్యెను. విరోధులు బెదిరించినను చెదరడయ్యెను. అతడు సత్యాగ్రహముతోనిండి నిరుపమానమైన శౌర్యముతో పాప మును ఖండించుచుండెను. కత్తి చేత బుచ్చుకొని తుప్పలను నరికినట్లుగా మాట్లాడుచుండెను. తుదకతడా మహోన్నత సేవయందే తన ప్రాణమును గోల్పోయెను. అతడు బోధిం చిన నీతిబోధలును సాధించిన న్యాయ మార్గములును ఇప్పుడు ఆట పాటలతో ప్రదర్శించబడును.

క॥ దేవుని నీతిని న్యాయం
బీవసుధను జాటవచ్చి యిలలో శ్రమలన్
చావును బొందిన ఆమోస్
జీవచరిత్రంబు యిదియె తేటగగనుడీ.

ఇప్పుడిద్దరు సాధువులువచ్చి భగవత్ప్రార్థన జేయుదురు గనుక నేను యింతటితో సభవారికి వందనము జేసికొని విర మించెదను.

## భగవత్ప్రార్థన

(ఇద్దరు సాధువులు చేతులు జోడించి పైకి చూచుచు నీ దిగువపాటను పాడుచు వచ్చెదరు)

(దాయ—శుభాకరా శుద్ధాకరా)

క॥ బిరాలనా – మొరాలకించి – బ్రోవరా దేవా
నరావతార – ధారివైన – నిన్నే నమ్మితి ॥ బిరాల ॥

1. తరాతరాల - నుండి నీ - వరభక్తులను
పరామరించి - వరములిచ్చి ప్రోచుచుంటివి ॥ చిరాల ॥

2. చిరాకు పడకు - మయ్యానా - దరిద్రత గని
పరాకులేక - బ్రోవుమయ్యా - పాపినన్గని ॥ చిరాల ॥

1 సాధు. వచ. శ్రీ కరమై, సుజనవశీకరమై, నిత్యసౌఖ్యాకరమై, ప్రభాకరమై, పావనశుభాకరమై, మనోహరమై వెలయు నీ పరిశుద్ధ నామమునే స్మరింతునో త్రయ్యేక దేవా, దివ్యానంత ప్రభావా, త్రాహిమాం త్రాహిమాం.

2 సాధు. వచ. ఎంతటి పాపినైనను నీ చెంతజేర్చి, వాని యంతరాత్మ బాధ దొలగింతువని వేదాంతులు గల్లంతుగ జెప్పుచుండ, నత్యంతయాశతో నీ చెంత జేరితినో శ్రీమంతా, భగవంతా, త్రాహిమాం త్రాహిమాం.

1 సాధు. వచ. దురంతకుడ, దుర్మార్గుడ, గ్వారుడ, దూరుడ నేరస్థుడ, ఘోరపాపుడ, సారెసారెకును నీ దారినుండి దూరముగ బారిన దురితాత్ముడ, గోరి నీ పాదారవిందములకడ జేరితినో నరావతారధారి యేసు రక్షకా, దీనరక్షకా, త్రాహిమాం త్రాహిమాం.

2 సాధు. వచ. పాలను ముంచిన నీళ్లను ముంచిన భవత్పాదంబులే దిక్కుగా జేసికొన్న దీనపక్షిని, జాలంబేటికి, నామొరాలకించి, నీ జాలిం జూపులు నాపై వ్రాలనిచ్చి యిక్కాలంబుననే నొక్క

మేలు నొసంగుమో సుగుణశీలా, శుద్ధాత్మా
త్రాహిమాం, త్రాహిమాం.

1_2 సాధు. కీర్తన. శరీర మందేనీకు యాత్మ సేవజేతును_మొరాల
కించి_బ్రోవరా పరాత్పరా నేడే.

(ఇద్దరు సాధువులును గురు శిష్యులను పేరులతో సంభాషణచేయుదురు)

శిష్యుడు. (2 వ సాధు కూర్చుండియున్న సభ వైపు నాశ్చర్యముతో జూచి) స్వామీ ఈ జనమంతా యెవరు? ఏలనిచట సమకూడిరి?

గురువు. (1 సాధు) ఈ దినమున ఆమోసు చరిత్ర ఆటగా నాడబడునట, దాని జూడవలెనని వీరంతా ఇట్లు సమావేశమైరి.

శిష్య. (ఆశ్చర్యముతో) ఆటలా? స్వామీ ఆటలాడవచ్చునా?

గురు. ఆడిననేమి? భక్తియుక్తముగా నాడిన నందు కీడేమి గలదు? బళ్లలో జదువు పిల్లలు మర్యాద యుక్తముగ తమ వాచకపుస్తకములోని కాకి గద్ద కథలెన్నిటిని ఆటలుగా నాడుటలేదు?

శిష్య. స్వామీ కథల నిట్లు ఆటలుగా నాడుటవలన ప్రయోజనమేమి?

గురు. శిష్యా, కథల నిట్లు ఆటలుగా నాడుటవలన కథలును వాటినీతిబోధలును మనస్సున లోతుగ నాటుకొని, యెన్నటికిని మరుపునకు రాకుండును.

అట్లయిన వీరు ఆమోసు చరిత్రనే ఎందుకు ఆడవలెను?

గురు. శిష్యా, ఆమోను ఆరంభ బోధకుడు. అందువల్ల బోధపని జేయువారికి నాతని చరిత్రమతిప్రియము; తత్కారణముచే వీరారంభ బోధకుడగు ఆమోను చరిత్రనే ఆటగా నాడుచున్నారు.

శిష్యు. స్వామీ. నాపై నాగ్రహపడకుడు. మరియొక్క మనవి చేసికొనియెదను, ఏదనిన, ఇపుడు ఆటనాడ బూనుకొనిన వీరందరు విద్యలేని మొద్దులే! నోరు విప్పిన నూరు తప్పులే! వీరా ఆటనాడి పాటపాడగల సమర్థులు?

గురు. శిష్యా, ఇచ్చట తప్పులు పట్టువారెవరు? కూర్చుండి యున్నవారందరు పెద్దమనుష్యులు, అయ్యాగార్లు, ఉదారవంతులు, దయార్ద్రహృదయులు, గాన మనయందెన్ని తప్పులున్నను వాటిని పట్టనేపట్టరు; పట్టినను బైటబెట్టరు; పెట్టినను తిట్టరు. మన రాగ, తాళ, శైలి సందర్భాభినయములయందు కుప్పలు కుప్పలుగా గనబడు తప్పులను మనకు చెప్పించి, యొప్పించి, మెప్పించి పంపుదురు. గనుక మనము భయపడవలసినపని యేమున్నది?

శిష్యు. ఆలాగైనయెడల ఈ ప్రయత్నమందు భగవత్సహాయము తోడుగా నుండునట్లు ప్రార్థింతమా?

గురు. అవును ఆలాగే చేయుదము.

సీ॥ దేవాది దేవుడా రావయ్య నేడు నీ
సేవకాళిట నిన్ను జేరవేడ
నీసాయమును మేము ఆశ్రయంబుగనమ్మి
ఈస్వల్పయత్నముంజేసియుండ
భాసురంబుగ నేడు యీసభా మధ్యను
నీశుభంబులతోడ నరిగి యిపుడు
బ్రోచుచు మాస్నేహబృందంబు నీవేళ
గాచుచు దయనుమా గానసభను

తే॥ గీ॥ ఈవులనుమాకు దగినట్లు యిచ్చినీదు
త్రోవలను మాకు గనపర్చి తేటగాను
జీవమును సమృద్ధిగ మాకు జెందజేసి
భావమందున నిజభక్తి బొందనిమ్ము.

శిష్యు. స్వామీ ఆట ఇంకా ఆరంభము కాకున్నదే?

గురు. అదిగో ఎవరో వచ్చుచునట్లు శబ్దము వినబడు
చున్నది!

శిష్యు. మొదట నెవరువత్తురు?

గురు. ఆమోనువచ్చును.

శిష్యు. తరువాత?

గురు. అడవిమార్గమున బోవుచున్న ప్రయాణికులు
వత్తురు. అదిగో వచ్చుచున్నట్లున్నారు. ఇకమౌన
ముగా నిక్కడ కూర్చుందము.

(అనిచెప్పి కూర్చుందురు)

# మొదటి రంగము

## ఆమోను అడవిలో నుండగా నతనికి చేరినవర్తమానములు

ఆమోను.—(నేలజూచుకొనుచు నిదానముతో నడిచివచ్చి కొంతసేపు ఒకచోట మౌనముగా నిలువబడి ఆకాశమువైపు నిదానించిచూచి, చేతనున్న కర్రక్రింద విడిచి, చేతులను రొమ్మును అనిచ్చి, ఆకాశమువైపే కొంతసేపు చూచుచు నిలువబడి, పిదప తలవంచి, వంగి, కర్రదీసికొని అటునిటు చూచి)

ఇచ్చట పచ్చిక హెచ్చుగా నున్నదే ఈ దినమున నిచ్చటనే నా పశువులను మేపెదను.

(అని చెప్పి కూర్చుండి తనలోతాను ధ్యానముచేయుచు నీ దిగువపాట పాడుకొనుచుండును)

(23 కీర్త. చాయ-శుభాకరా శుద్ధాకరా)

కీర్తన॥ 1. యెహోవాయే నా కాపరి లే-మేమి గలుగదు
మహాకృపలతో బ్రోచినన్ను-మనుపునాతడే ॥ యెహోవా ॥
2. పచ్చికగల చోట్ల నను ప-రుండజేయుచు
కడు హెచ్చగు సౌఖ్యములు సదా-నిచ్చునాతడే॥ యెహోవా ॥
3. శాంతికర జలములకు నను-సాగజేయుచు
విశ్రాంతి ప్రాణమున కొసంగు-విభుడు ఆతడే ॥ యెహోవా ॥

(ఇంతలో ఇద్దరు ప్రయాణికులు మాట్లాడుకొనుచువత్తురు)

1 ప్రయా. మల్కీయా, పిలిస్తీయులేమో మహాగోలచేయుచున్నారట అదినిక్కమా?

2 ప్రయా. నిక్కమే నిక్కమే. ఎక్కడజూచినను, ఈరక్కసులవార్తయే యెక్కువగా వినబడుచున్నది,

వీరికి ఫిలిస్తీయులను పేరుకన్న, పిశాచులను పేరు యెక్కువగా తగియున్నది.

1 ప్రయా. ఏమీ, అంతటి మహాత్ములా?

2 ప్రయా. ఇక జెప్పవలెనా? వారు తాము చెరపట్టిన వారిని ఎంతమాత్రమును కరుణించక ఏదోము పరము జేయుచున్నారట.[1]

1 ప్రయా. హా! యెంతటి క్రూరకార్యమయ్యా?

క॥ "చంపదగినయట్టి శత్రువు తనచేత
జిక్కినేని కీడు చేయరాదు
పొసగ మేలుచేసి పొమ్మనుటే చాలు
విశ్వదాభిరామ వినురవేమా."

యని పెద్దలు చెప్పిరే. ఎంతటి ఘాతుకమయ్యా, వారేమో నిబంధనల జేసికొన్నామని ప్రగల్భాలుగొట్టిరే.

2 ప్రయా. వారినిబంధనలు నేలగూలినవి. అయితే మల్కీయా ఏదోమీయులేమైన కొంచెము మంచివారేనా?

2 ప్రయా. అయ్యయ్యో, లేదులేదు. దుర్మార్గమునందు ఏదోమీయులు ఏడాకులు యెగ జదివినవారేగాని దిగ జదివినవారు కారు.

1 ప్రయా. ఏమీ ఆలాగునా?

2 ప్రయా. అవును. వారు అందినమట్టుకు అందరిని ఎర్రసముద్రమువరకు గొట్టుకొనిపోయి గొడ్లనమ్మినట్లు

---

[1] 1 : 6.

వారిని తెగనమ్ముకొనుచున్నారట, మిగిలిన వారిని సహోదరులనియైనను చూడక ఖడ్గము చేతబట్టి చొప్పకట్లను నరికినట్లుగా, వారిని నరుకుచున్నారట.[1]

1 ప్రయా. హా, హా, ఎంతటి ఘోరకలిగా నున్నదయ్యా! ఎంతటి ఘాతుకమయ్యా (ఆకాశము వైపు చూచి) ఓ భగవంతుడా నీ వెక్కడినుంటివయ్యా? ఈ దుర్మార్గుల కేమియు ప్రతిఫలము నియ్యవేమయ్యా? హా దైవమా!

2 ప్రయా. ప్రతిఫలము లేకేమి? నూరుగొడ్లను తినిన రాబొందు ఒకనాడు గాలివానకు తానును చావకుండునా? ఆలాగున ఎదోమురాజు చచ్చి భూమిలోనికి పోయినను అతడు జేసిన అన్యాయము అతనిని భూమిలోనుండి బయటికి లాగక మానెనా?

1 ప్రయా. ఏమి! అది యెట్లు?

2 ప్రయా. మోయాబు ఏతెంచి, చచ్చిన ఎదోమురాజు శవమును బైటకులాగి అతని ఎముకలను సహితము ఏరి కాల్చి సున్నము[2] చేసిన సంగతినీకు వినబడ లేదా?

1 ప్రయా. ఛీ ఛీ! చచ్చిన శవమును బైటకులాగే పచ్చి దుర్మార్గు లెవరయ్యా? ఎముకలను ఏరి సున్నము

[1] 1 : 11. [2] 2 : 1.

జేయుట వారికి మన్ననగా నుండెనుగా! ఛీ ఛీ! వీరిమతమేమి మతమయ్యా? వీరిమతము మండి పోను, వీరి నీతి నేలగూల! ఇట్టి నీచులమాట నిక నోట వచించకుందము. ఇకపోదమురమ్ము.

2 ప్రయా. పోదముగాని ఇట్టి నీచులకు బుద్ధిచెప్పే పెద్ద లెవరును లేకయున్నారు మిత్రమా!

1 ప్రయా. ఎవరో ఒకరు లేవకపోరు. రమ్ము మనము పోదము.

(ఆమోసువైపు దిరిగి) ఓయి గొల్లబోయడా ఈ మార్గము దమస్కుకు పోవునా?

ఆమోసు. తిన్నగా పోవును. పొండు. (తనలోతాను) ఆహా దేశములెంత ఘోరకలిగా నిన్నవి?

(గిలాదువాడొకడు తెరలోపలనుండి అరచును)

శరణుశరణు, శరణు శరణు, స్వామీ శరణు శరణు.

ఆమోసు. (శబ్దమువచ్చిన దిక్కువైపు తేరిచూచుచు) ఎవరిది? ఎవరిది

గిలా. స్వామీ శరణు శరణు రక్షించుడు.

ఆమో. (తేరిచూచి) ఓహో యెవడో పరిగెత్తి వచ్చుచున్నాడే. ఏదో విపత్తు వాటిల్లినట్లున్నది!

గిలా. (దగ్గరకువచ్చి సాగిలపడి) స్వామీ స్వామీ.

ఆమో. ఏమి, ఏమి?

గిలా. (కొంతసేపు అట్లే మౌనముగా పడియుండును)

ఆమో. ఏమీ, ఏమీ?

గిలా. హజాయేలు హత్య! హజాయేలు!

ఆమో. హజాయేలు యెవడు?

గిలా. హజాయేలు దమస్కువాడు, అరామీయులరాజు.

ఆమో. నీవెవడవు?

గిలా. గిలాదువాడను. గులాపువాడను.

ఆమో. మంచిది, యేమిజరిగెను?

గిలా. కొంచెము తాళుడు కొంచెము తాళుడు. చెప్పు కొనియెదను. అలసటగా నున్నది (అని ఒగర్చుచుండును)

ఆమో. (మనస్సులో) యేదో విపత్తు సంభవించినది! ఏమి జరిగెను అబ్బీ?

గిలా. స్వామీ, హజాయేలు హత్యలు దమస్కువారి దుండగములు నేనేమి జెప్పుదును స్వామీ! పంట దుళ్లగొట్టు యినుపపనిముట్లతో[1] మమ్మును పొడిచి చంపుచున్నారు స్వామీ.

ఆమో. హా! అక్కటా! ఎంతటి కార్యము లీ ప్రపంచములో జరుగుచున్నవి! గిలాదుకు ఏలాటి దురవస్థ గలిగెను!

[1]1: 3.

గిలా. ఉత్తరమునుండి యిట్లు ఆరామీయులు ఒత్తుచుండగా దక్షిణమునుండి అమ్మోనీయులువచ్చి తిరుగటి రాళ్లమధ్యను వరిగింజను విసరినట్లుగా విసరుచున్నారు స్వామీ. ఆరామీయులకన్న అమ్మోనీయుల బాధ అధికముగా నున్నది గర్భిణీస్త్రీలను సహా కరుణించక గర్భములను చీల్చి[1] చంపుచున్నారు స్వామీ ఏమని చెప్పుదును.

ఆమో. (మొఖము త్రిప్పి) ఛీ ఛీ! పాపిష్ఠులారా ఎంతటి పాపమున కొడిగట్టుకొనుచున్నారురా. (అతనివైపుదిరిగి) అబ్బే, వారెందుకిట్లు చేయుచున్నారు? కారణమేమి?

గిలా. కారణమేమిగలదు? తమసరిహద్దులను[2] విశాలము చేయదలచి వారిట్టి పాతకమున కొడియగట్టుకొనుచున్నారు. అండ, ఆశ్రయముగానక ఈ యీడవులందుబడి చెట్టుకొక్కడు పుట్టకొక్కడుగా పారిపోవుచున్నాము స్వామీ; మాదురవస్థ నేమని చెప్పుదును? ఇకనాకు సెలవొసంగడు స్వామీ నేనిటుబోయెదను. (అని చెప్పి పారిపోచూచును)

ఆమో.—అయ్యో అయ్యో ఎక్కడికి బోవుదువు?

(అని చెప్పుచుండగా గిలా. పారిపోవును) (ఆమోసు చేతులు పైకెత్తి ఆకాశమువైపు చూచుచు)

[1] 1: 13. [2] 1: 13.

ఆహా, ఓ పరాత్పరా, పితరుల దేవా, పరాక్రమశాలీ, నీ వేల ఇట్లు మౌనముగా నుండెదవు? నీవు నీ ఆకాశము లను వంచుకొని యేల వేంచేయవు దేవా? యెహోవా యను నీనామప్రభావము చొప్పున నీ అత్యున్నత బలాతిశయము చొప్పున ఐగుప్తు రాజైన ఫరో యొక్క పొంగును క్రుంగ జేసిన వీరపరాక్రమశాలివి నీవు కావే? నీన్యాయదండమును చేత బట్టి యీ పాపిష్ఠుల పొంగు నేల అణచవు? నీనామము నేల మహిమ పరచుకొనవు? నీ నీతిని, నీ న్యాయమును భూమిపై వరదలై పారనియ్యుము దేవా. అగ్నిహోత్రమువంటి స్వచ్ఛ మైన నీ నీతినిబట్టి దుష్టులను సంహరించి, దుర్మార్గులను మాత మార్చి, సర్వజనాంగములపై, సర్వరాజ్యములపై నిన్ను నీవు హెచ్చించుకొనుము దేవా; నీ పరిశుద్ధచిత్తమే జరుగనిమ్ము. నీ చిత్తము, నీ సంకల్పము రవ్వంత నీ దాసుని కందిమ్ము దేవా, హా! హా!

(తనలోతాను) ఎంత ఘోరకలిగా నున్నది. దేవుడెంత శాంత ముగా నున్నాడు!

కీర్తన॥ అయ్యో దేవ యేల - భువిలో నిట్టిగోల - చాలా ఘోరకలిగా నుండ నేల - ఇంతశాంతితో నీవుండ నేల॥

1. భీకరంపు తీర్పు - లోకమునకు బంపు - ప్రాకటంబుగ దుష్టుల జంపు - మేకచక్రాధిపత్యంవహింపు॥

2. ఎనలేనిపాపం - వినలేనిదోషం - కనలేనిఘోరయతిక్రమం - నీవే తునిమి హరించు మీవిధం॥

3. ధరలో నీనీతిన్ - బరిశుద్ధన్యాయం - స్థిరముగా స్థాపించు నీ చిత్తం- నురుచిరముగ నేలుమీలోకం॥

# హా, దైవమా.

(తెరపడును)

సాధువులిద్దరును తిరిగివచ్చి యీ దిగువసంభాషణచేయుదురు.

శిష్యు. స్వామీ ఇప్పుడు జరిగినదంతయు యేమి? కొంచెము వివరించెదరా?

గురు. ఆమోసు అడవిలో పశువులను గాచుకొనుచుండగా మార్గమునపోవు ప్రయాణికుల సంభాషణనుబట్టి ఆయా దేశములనుగూర్చి తాను విన్నదియు కన్నదియుఇప్పుడు ప్రదర్శించబడెను.

శిష్యు. శరణుశరణు అంటూ వచ్చినవాడెవడు?

గురు. గిలాదులో ఘోరబాధలకు తాళలేక పారిపోవువాడొకడు మార్గములో ఆమోసు కెదురుపడి తన యవస్థలను ఎరిగించుకొనుచున్నాడు.

శిష్యు. స్వామీ ఆగ్రహపడకుడు ఇప్పుడెవరు వచ్చెదరు?

గురు. ఇపుడు అమోసు తిరిగివచ్చును. అతడు మరియొక దినమున మందలను కాచుకొనుచుండగా తోటి గొల్లలకును తనకును జరిగిన సంభాషణ యిప్పుడు ప్రదర్శించబడును. ఇకను మాట్లాడకుము అదుగో ఆమోసు వచ్చుచున్నాడు.

# రెండవ రంగము

## ఆమోసుకును అతనితోటి గొల్లకును జరిగిన సంభాషణ

(ఆమోసు పాటపాడుకొనుచూ వచ్చును)

(24 కీర్త)

కీర్తన॥ భూమియు దానిలోని సం—పూర్ణతంతయు—స్వామి యెహోవావే—ధరయు సర్వజనులును॥

1. సముద్రములపై వేసె—స్థిరపునాదిని—ప్రవాహములపై స్థిర—పరచె దానిని॥

2. ప్రభువు పర్వత మెక్క—పోదగ నెవడు—పరిశుద్ధస్థలమున నిలుచు ప్రముఖు డెవ్వడు॥

3. వ్యర్థపువాటిపై మనుస్సు—నుర్వినుంచక—నిర్దోషపుచేతులు—గల శుద్ధహృదయులే॥

4. వారు ప్రభువుచే నా—శీర్వాదంబులన్—నారక్షకుని నునీతి—మత్వ మొందెదరు॥

(అటుయిటూ చూచి) అన్నా మాయూరి గొల్లలెక్కడను కాన రాకున్నారే, వారు తమ మందల నెటు దోలుకొనిపోయిరో! ఇచ్చట కూర్చుండెదను.

(ఇద్దరుగొల్లలు మాట్లాడుకొనుచూ ప్రవేశింతురు)

1 గొల్ల. తమ్ముడూ తెరహు (మనస్సులో) నీ వెక్కడను కాన రాకున్నాడే చాలాదూరములో నున్నాడా యేమి? (గట్టిగా) తెరహూ—తెరహు!

2 గొల్ల. (తెరలోపలనుండి) అన్నా అన్నా.

1 గొల్ల. అబ్బో, యేమి సుస్తీరా?

2 గొల్ల. సుస్తే లేదన్నా, వస్తూనే యున్నాను.

1 గొల్ల. ఈ ప్రాంతము మందలను మేపుటకు అనుకూలముగా నున్నది తమ్ముడూ!

2 గొల్ల. అవునన్నా, ఇచ్చట పచ్చిక పచ్చని పరుపును పోలి యున్నదన్నా! ఆహా, యేమి అన్నా ఈ పచ్చిక నేలలు యీ పర్వతపంక్తులు! వీటినిచేసినవా డెవడన్నా? చిత్రముగా నున్నది!

1 గొల్ల. గాలికూడా వీలుగానే తోలుచున్నది తమ్ముడూ!

2 గొల్ల. అవును, ప్రాణము హాయిగా నున్నదన్నా? ఇంత చక్కనిగాలి యెక్కడనుండి వచ్చుచున్నదన్నా?

1 గొల్ల.—గాలిజోలి యట్లుంచి యీ వృక్షములను వీక్షించితివా? ఆ మర్రిచెట్టు గర్వముతో విర్రవీగుచున్నది తమ్ముడూ!

2 గొల్ల ఆ వెదురుచెట్టును చూడుమన్నా; అదురుబెదురు లేక పెరుగుచున్నది?

1 గొల్ల. ఆహాహా! గెలలభారముచే వంగియున్న యీ ఫలవృక్షములను చూడుము తమ్ముడూ!

2 గొల్ల. అన్నా మనుష్యపాద మెన్నడూ ఈ ప్రాంతమున ప్రవేశించినట్లు కనబడదే! ఆ యున్నతస్థలము

లలో దిరిగి యచ్చట నా పొన్నవృక్షములను నాటినవాడెవడై యుండును?

1 గొల్ల. నాటుటయేనా? ఈ అడవిచెట్లన్నిటికి నీళ్లుదోడి వాటిని పెంచుచున్నవాడెవడో గ్రహించగలమా?

(3—4 గొల్లలు మాట్లాడుచు ప్రవేశించుదురు)

3 గొల్ల. ఒరేవ్, ఒరేవ్! జెరోము?

4 గొల్ల. ఆ, ఆ.

3 గొల్ల. మనపుల్లెద్దు పొడుచును సుమా మెల్లగా తోలుకొనిరా.

4 గొల్ల. పుల్లెద్దుకేమిగాని మనబొల్లిదూడ నన్ను తల్లక్రిందులు చేయుచున్నదోయి; నీకేమి? నీవు చల్లగానే వెళ్లుచున్నావు.

3 గొల్ల. (కండ్లు చిట్లించి) అబ్బా కారుచీకటిగా నున్నదే మిత్రమా నక్షత్రము లెచ్చటను కానరాకున్నవే.

4 గొల్ల. నక్షత్రములు కనబడ కేమి? వెనుకకు తిరిగి చూడుము. అవిగో సప్తఋషి నక్షత్రములు, అవిగో మృగశిరనక్షత్రములు.

4 గొల్ల. అబ్బా యీ నక్షత్రములు క్రమముదప్పక కనబడునయ్యా; ఎన్నడూ పనిమీదనైనా ఎక్కడికిని వెళ్లవు కాబోలును!

4 గొల. వాటి నెవడో నడిపించుచుండవలెను సుమా!

3 గొల్ల. అవునవును వీటన్నిటికి కర్త యెవడో యొకడులేని యెడల నల్లని జీడిగింజలవంటి యీ కారుచీకటులు తెల్లని ఉదయముగా నెట్లు మారగలవు ?

4 గొల్ల. (కొంచెము ముందుకుపోయి ఆశ్చర్యముతో) ఇదేమయ్యా! నీళ్ల ప్రవాహామా ?

5 గొల్ల. అబ్బా! కొండలమీద నీ యాఘుండ ప్రవాహాము లను పరిగెత్తించే ప్రజ్ఞావంతు డెవడయ్యా ?

4 గొల్ల. నీళ్ల ప్రవాహాములేనా ? సరస్సులు, సరోవరములు సెలయేళ్లు ?

3 గొల్ల. అబ్బా తరచినకొలదీ తరుగకున్నదయ్యా, చిత్ర విచిత్రములతో నింపిన యీ భూమికిన్ని పైనున్న ఆకాశమునకును పునాదినివేసి వీటి నిచ్చట నిలి పిన వాడెవడయ్యా నాకు తోచకున్నది !

ఆమో. (ఈ మాటలన్నిటిని వినుచు, తలయాడించుచు ముఖముప్రక్కకుద్రిప్పి) ఏమి యీవెర్రి ? వీటినిచేసిన దెవడెవడని ఆశ్చర్య పడుచున్నారే! యెహోవా యని యెరుగరు కాబో లును. (వారివైపు దిరిగి) ఈ పర్వతములను గాలిని మొదలైనవాటిని పుట్టించిన దెవరో యెరుగరా ?

3 గొల్ల. అదియే ఆలోచించుచున్నాము.

కీ॥ (చాయ: తెరుగెమున్నది)

ఆమో. యెహోవా యే – సైన్యముల నేలుదేవుం – డేహోవాయే మహోన్నతుండగు యెహోవాయే యీ – మహా పర్వతములను రూపించి[1] ·

---

[1]4 : 13.

యిహామున వీచెడు - మహా గాలులను - సహా పుట్టించినవాడు ॥
యెహోవాయే ॥

1 గొల్ల. ఎవరు? ఎవరెవరు? యెహోవాయా?

2 గొల్ల. వీటన్నిటిని యెహోవాయే చేసెనా?

ఆ మో. పర్వతములను రూపించినవాడును గాలిని పుట్టించినవాడును యెహోవాయే. దేవుడును సైన్యముల కధిపతియునగు యెహోవాయే?

1 గొల్ల. ఇది ఎట్టిమాట! వింతగా నున్నదే!!

ఆ మో. (అనుపల్లవి) ఉదయమునందున-అంధకారమును-ఒదవజేసి వింతగ మానవుల - హృదయపు యోచనలెరిగి భూమిపై - యున్నత చోట్లలో దిరిగెడి[1]వాడు ॥ యెహోవాయే ॥

2 గొల్ల. ఇది నాకు అసాధ్యముగా తోచుచున్నది. యెహోవా యేవో కొన్నిటిని చేసియుండునుగాని అన్నిటిని చేయగలిగియుండునా?

ఆ మో. (అనుపల్లవి) సప్తఋషి నక్షత్రంబులను - సరిగజూచి మృగశీర్ష చుక్కలను[2] - యుక్తంబుగ సృష్టించినదెవరు? - యెహోవా దేవుడుగాక ॥

3 గొల్ల. అవును యెహోవాగాక యెవరు? ఆయనే అన్నిటికిని కర్తయైయుండవలెను.

1 గొల్ల. ఆలాగుననా?

ఆ మో. (అనుపల్లవి) కారుచీకటిని కనకపు ఉదయము - గా[3] మార్చిన ధీనమంతుడు యెవడు - చేరిపగటిని రాత్రిచీకటిగ కోరిమార్చినవా డెవడు ॥ యెహోవాయే ॥

---

[1] 4 : 13. [2] 5 : 7. [3] 5 : 8.

3 గొల్ల. కీ॥ (పల్లవి) జౌనా నాయనయే-అన్నిటిని జేయువాడు-జౌనా
నాయనయే ॥

ఆమో. (అనుపల్లవి) భూమిని మొత్తి - కరుగజేయుచు - దానిని మెత్తగ
జేయునదెవడు-ఈ మహాసాగరజలముల బిలచి - భూమిపై-
నడుపు[1]నదెవరు ॥

3 గొల్ల. కీ॥ ఆవునా నాయనయే - అన్నిటినియేలువాడు - అవునా
నాయనయే = దేవుండును సై - న్యంబుల కధిపతియగు
యెహోనా - యేపైవాడు - భువిదివియందున - ఆయన
నామము - పూర్ణంబుగానుతినొందు ॥అవునా॥

ఆమో. (అనువల్లవి) మేడగదుల నా-కాశమందున-మేలుగ తనకై-గట్టు
కొనుచును[2] - వేడుకతో భువిదివికి పునాదులు వేసి
పేరొందినవాడు ॥ యెహోవా ॥

3. 1. 4. గొల్ల. కీ॥ అవునానాయనయే - అన్నిటిని జేయువాడు - అవునా
నాయనయే = దేవుండును సై - న్యంబుల కధిపతి - యగు
యెహోవాయే పైవాడు భువిదివియందున - ఆయన
నామము - పూర్ణంబుగానుతినొందు ॥ అవునా ॥

1 గొల్ల. అవును యెహోవాయే.

1 గొల్ల. అవునుగాని ఇంత సామర్థ్యముగల యెహోవా ఆ
దమస్కు పురవాసులనేమియు చేయడేమయ్యా-
వారిని యిష్టము వచ్చినట్లెల్లా - తిరుగ నిచ్చు
చున్నాడే!

3 గొల్ల. (ఆమోసుపైబడిరిగ)

[1] 5 : 8.. [2] 9 : 6.

(ఛాయ : ఖనతెనచన)

కీ॥ ఓదర్శకుడా నీవు – ఓర్పుతో జెప్పవయ్యా –
ఆ దమస్కునుగూర్చి – ఆజ్ఞయేలాగున్నదో ॥ఓదర్శకుడా॥

1 గొల్ల. కీ॥ దాని జనులు పంటదుళ్ల – గొట్టుపనిముట్లతోను –
పూని గిలాదు అను – పురమును నూర్చిరయ్యా ॥
ఓ దర్శకుడా ॥

4 గొల్ల. 3 లో. ఆమ్మోనీయులనుగూర్చి నీవేదో వార్తవింటి
నంటివే ?

2 గొల్ల. 3 లో. కీ॥ ఆమ్మోనీయులనుగూర్చి – అతిహేయవార్తవింటి –
నెమ్మదినొంది యది – నిజమైతే జెప్పవయ్యా॥
ఓ దర్శకుడా ॥

3 గొల్ల. 2 లో. కీ॥ చేలసరిహద్దులను ?. – కాలముగ జేయదలచి –
గిలాదులో గర్భిణి – స్త్రీలను చీల్చిరయ్యా ॥
ఓ దర్శకుడా ॥

ఆమో. స్నేహితులారా,

(ఛాయ : అపునానజరేమినాక)

కీ॥ సైన్యములరయె – హోవా సెలవిచ్చుమాట – హితులారా – చెవు
లారా నాలకించుడి – శ్రమగలుగును శ్రమగలుగును – శ్రమగలు
గును దమస్కునకు – అమితమైన శ్రమగలుగును – ఆ మహాదమ
స్కునకిక ॥ సైన్యముల ॥

హాజాయేలు మందిర[1]ములో – నగ్నివేయనది దహించు – ఆ మహా
దమస్కునగరులన్ – నిజముగా నా – పురవాసుల – నిర్మూలము
జేసెదను – ఆరామియుల చెరబట్టెద – ధరణీశుల సంహరించి ॥
సైన్యముల ॥

[1] 1 : 4.

దేవుడు సైన్యముల కధిపతియునగు యెహోవా సెలవిచ్చునదేమనగా దమస్కునకు శ్రమ శ్రమ, నేను హజాయేలు మందిరములో నగ్నిరగులబెట్టెదను. అది దమస్కు రాజనగరులను దహించివేయును. అరామియులు చెరపట్టబడెదరు. రాజదండము వహించినవాని నాశనము చేయుదును. ఇదే యెహోవా వాక్కు.

1 గొల్ల. ఎంత ఉపద్రవము రానైయున్నది?

2 గొల్ల. అట్లయినయెడల అమ్మోనుకుకూడా శ్రమతప్పదు.

(రాయ-భయ తడకి ఒరాలారా)

ఆమో. కీ॥ అమ్మోనీయులకు శ్రమలు ఆవనితప్పవనుచు దేవు - డాన
తిచ్చెనది వాస్తవమే - ఇమ్మహిలో వారి నగరు - లగ్నిపాలు
అగుట నిజము - నమ్మకొనిన రాజును - అధిపతులు చెరకు[1]
బోదురికను ॥ ఆమ్మో ॥

3 గొల్ల. కీ॥ స్నేహితుడా - సరియదియా - చెప్పుమీ యూదానుగూర్చి-
శ్రీ యెహోవా సెలవిచ్చునది - (1) ఆహా యూదావారు
కూడ అనుసరించి పూర్వికులను - మహోన్నతుని ధర్మ
శాస్త్ర-ములను[2] మీరి తప్పిరయ్యా ॥ స్నేహితుడా సరి ॥

ఆమో. కీ॥ శ్రమగలుగును-శ్రమగలుగును - శ్రమగలుగును యూదాకని-
సైన్యములగు-హోవ జెప్పెను - సమకూర్చెద యూదాపై -
అమితమైన అగ్ని నేను-రమణీయపు యెరుషలేము-లయమగు
నిక[3] అగ్నిచేత ॥ సైన్యముల యెహోవా ॥

1 గొల్ల. కీ॥ ఆహా ఆహా యెరూషలేమా - మహోన్నతుని మందిరమా -
ఇహములోనీ కిట్లుగలిగెనా - (2) మహాఘోరకాలమిదియె -
సహించుటకు యెవరితరము. (1,2,3,4) మహాశ్రమలు మహా
శ్రమలు మహాశ్రమలు మహాశ్రమలు॥ఆహాఆహా యెరూషలే॥

[1] 1 : 15. [2] 2 : 4.

2 గొల్ల. దేశములన్నియు పాడుగానున్నవి, అయితే ఉత్తరమున సమరయ పర్వతములమీద నున్న షోమ్రోను యెట్లున్నదో ?

4 గొల్ల. అవును అది మేలు నగరులతోను వేలసొమ్ములతోను తులదూగుచు రంగరంగవై భాగ్యములతో పొంగుచున్నది. దాని అంతరంగ స్థితియెట్లున్నదో ?

(రాగము-ఆహిరి తా॥ [illegible] మహాదురాత్మా)

3 గొల్ల. కీ॥ ఆమోసూ-చెప్పవయ్యా-షోమ్రోను పురము జూచి - నీమదికి
యేమి దోచెనో ఆ మహాపురం-అది అందమైనది. (1,3గొ)
ఏమాత్రము మరుగు లేక-ఈ మహిలోదాని గతిని ॥ (1,2,
3,4గొ) ఆమోసూ ॥

ఆమో. కీ॥ అదిగో సమరయ పర్వత - మదిగో కనులెత్తి చూడు-దందు
జరుగు గొప్ప యల్లరి - బీదజనులను పెట్టు - బాధజూడుడి[1]-
(2 గొ) పీడలనా, (4 గొ) బాధపనులా, (ఆమో)
మేదినిట్టి ఘోరకలియా ॥ అదుగో సమయ ॥

1 గొల్ల. కీ॥ ఇంతఘోర అన్యాయమా - ఇలనా షోమ్రోను ర - వ్వంత
యైన నీతి నెరుగదా - (ఆమో) కొంతయైనను నీతి -
క్రియలు జేయదు-ఎంతో సమకూర్చును బల - వంత దోపుడు
లను[2] యిలను ॥ అదుగో ॥

2 గొల్ల. హా, షోమ్రోను! షోమ్రోనులో ఎంతయల్లరి !! బీదలబాధ, బొలాత్కారము, నగరులలో దోపుడుసొమ్ము పంచుకొనుటయా! హా, ఎంత ఘోరకలిగానున్నదయ్యా !!!

2 గొల్ల. వారికి బుద్ధిచెప్పువా రెవరులేరా?

---

[1]3 : 9 : 4-1. [2]2 : 10..

ఆమో. సీ॥ గుమ్మమందున బుద్ధి నెమ్మితో జెప్పిన
నిమ్మహిం బగబట్టి¹ నెపుడు జూచి
సత్యంబు మాట్లాడు సజ్జనం బాలనెల్ల
అత్యంత సూయతో నవని జూచి
నీతిమంతుల బెట్టనిందలం బాధల
జేతనైన శ్రమంజేయువారు
దోషంబు బోగొట్ట దోచుచు లంచముల్
మోసంబు జేయు ఘోర మోను వారు
తే-గీ॥ త్రిప్పుదురు నీతిమార్గంబునుంచి వారు
ఒప్పగా న్యాయమున కేగు నుర్వీజనుల
చెప్పరానట్టి తిప్పలం బెట్టు చుండ్రు
ఇప్పగిదినిట్టి పాపంబు లెగబడుచును.

4 గొల్ల. చెడు కాలము!

3 గొల్ల. వినాశకాలము!

1 గొల్ల. మిత్రులారా మనమింతటితో మనమందలను మళ్లిం చుకొని పోవుదము. వర్షకాలము దగ్గరలోనున్నది. మన మిక్కడ నున్నయెడల మందలు చనిపోవును గనుక పోదము రండు.

2 గొల్ల. కొన్ని ఆడుగొఱ్ఱెలును లేగలు నున్నవి. వాటిని మెల్లగా తోలుకొని పోవలెను.

3 గొల్ల. మనమీ గొఱ్ఱె బొచ్చు అమ్ముకొనవలసిన పని యొక టున్నది. పోదముర౦డు.

ఆమో. నేనుకూడా వచ్చెదను. బేతేలుకు పోయి అమ్ము కొందము.

4 గొల్ల. అవును అదియే మంచి స్థానము.

(అందరును వెళ్ళిపోవుదురు)

¹5 : 10-12.

## సాధువుల సంభాషణ

శిష్యు. స్వామీ, ఈ కథ భావమెరింగించెదరా?

గురు. శిష్యా, ఇహపరముల యందుండు సమస్తమును భగవద్వశము. ఆకాశమందుండు సమస్తమును ఆయన ఆధీనము. భూమియందున్న ప్రతిదియు ఆయన హస్త కృత్యము. ఈ ప్రపంచమందు దృష్టికి గోచరమగు పక్షి, వృక్ష, జంతు జాలంబులును, సమస్త నరసము దయములును అనుదినమును ఆ మహానుభావుని చేతి నుండియే ఆహారమును గొనిపోయి, తమ పొట్టపోసి కొని జీవించుచున్నవి. ఏలనన, సమస్తమును ఆయనదే, సమస్తమును ఆయన మూలముగా కలిగెను, కలిగి యున్నదేదియు ఆయన లేకుండ కలుగలేదు. ఇపుడాయన సర్వముపై సర్వాధికారమువహించి, ఏకచక్రముగా నేలుచు, సర్వలోక చరిత్రను తన సామర్థ్యముచేత నడుపుచున్నాడు. తన చిత్తమును భూమిపై జరుపుటకు సర్వరాజ్యములవారిని తన సాధనములుగా నుపయోగించుచున్నాడు; భూరాజులు చక్రవర్తులు, సార్వభౌములు ఆయన చేతిలోని ఆటబొమ్మలు. బొమ్మల నాడించినట్లు ఆయన వారిని ఆడించుచున్నాడు. ఒక బొమ్మనుమార్చి మరియొక బొమ్మను నిలువబెట్టుచున్నాడు. ఆయన దృష్టిలో నీ ప్రపంచమే ఒక బొమ్మరిల్లుగా నున్నది. మంటి పురుగువంటి మానవుని ఈ బొమ్మరింటిలోబెట్టి,

వారు ఒండొరులయెడల నడుచుకొనవలసిన కొన్ని విధులను వారికి నియమించి, వారు అన్యోన్యమైత్రితో బ్రతుకవలయునని ఆయన కోరుచున్నాడు. గాని కించిజ్జ్ఞుడైన మానవుడు ఇది కొంచెమైనను గ్రహించక, గర్వించి, మదించి, బీదలవంచించి, పరులను తుంచనాడి, ముందుగతి యోచించకపోవుచున్నాడు. భగవంతుడు దండధరుడై యేతెంచి, కొంచెమైనను పక్షపాతము వహించక, వారే జనాంగపు వారైనను ఒక్కొక్కనిని ఎంచి, పరీక్షించి, వారి గర్వములను తుంచునను సత్యమును గ్రహించకున్నారు. పాపమునకు జీతమున్నదన్న పరమోక్తి వారికి పుక్కిటిపురాణముగా నున్నది. మీరు కొలుచు కొలత చొప్పుననే మీకు కొలవబడునన్న మాట వారికి బూటకముగా నున్నది.

ఆహా, శిష్యా ఆనాడే కాదు; ఈనాడు సహితము మనుష్యులు భగవంతుని లక్షణములను దెలిసికొన కున్నారు. భగవంతుని నొక పిచ్చివానిగ గట్టివేసి తామే ప్రజ్ఞావంతులమన్నట్లు ప్రవర్తించుచున్నారు. అయినను భగవంతుడు దీర్ఘశాంతుడై, దయాపూర్ణుడై, ఈ చర్యలన్నిటిని సహించుచు, తండ్రిభావముతో—నాబిడ్డలారా “మనుష్యులు మీకేమేమి చేయవలెనని కోరుదురో మీరును వారికి ఆలాగు చేయుడి” నేను మిమ్మును ప్రేమించిన ప్రకారము మీరును ఒకని నొకడు ప్రేమించుడి అని చేతులు చాచి పిలుచుచున్నాడు. ఆయన జాలిగల పిలుపులను మనష్యు లాలకించుట యెప్పుడో గదా!

(సాధువుల ఊర్చుండుట [illegible])

# మూడవ రంగము

## బేతేలులోని తిరుగుబాటు

### 1 వర్తకులు 2 ధనికులు, 3 న్యాయాధిపతులు
### 4 యాజకులు మున్నగువారి అక్రమములు

(ఇద్దరు వర్తకులు మూటలు ఎత్తుకొని మాట్లాడుకొనుచు ప్రవేశింతురు)

1 వర్త. ఆట్రగడ్డాలు అక్కుళ్లు రామసాగరాలు ధాన్యము, గోదుమ ధాన్యము కొంటా రాహోయి!

కూర్చుండి అంగడి సర్దుకొనుచుండగా ఆమోను లోపలికివచ్చి ఒకమూలను నిలువబడి సంగతులను చూచుచుండును.

2 వర్త. (1 వ వర్త. తో) రేపటి దినమున అంగడి పెందలాడే పెట్టవలెనయ్యా.

1 వర్త. రేపు అంగడి యెట్లా పెట్టగలవయ్యా? రేపు అమావాశ్య.

2 వర్త. అబ్బా, యీపీడ యెప్పుడు వదులునయ్యా. నిన్నటి దినము అంగడిపెట్టవలెనంటే నిన్న విశ్రాంతిదినమయ్యె. రేపు అమవాశ్యయట, ఈ పండుగ దినములంటే నా ఒళ్లు మండుచున్నదయ్యా. ఇది యెప్పుడు గడిచిపోవునో తెలియకున్నది.

1 వర్త. కీ॥ అమావాస్య-యను దినములపు అవని గడుచున దెప్పుడో[1]-సమ
యమందున ధాన్య మమ్మి సొమ్ము కూర్చున దెప్పుడో॥ఆమా॥

2 వర్త. కీ॥ ధరను విక్రాం-తను దినములవి-దరిగిపోవున దెప్పుడో[2]-త్వరగ
నంగడి బెట్టి గోదుమ-ధాన్యమమ్మున దెప్పుడో ॥ ఆమా ॥

1 వర్త. నీయొద్ద గోదుమలు కొలిచే మానికె యున్నదా?

2 వర్త. ఉన్నదిగాని కొంచెము చిన్నదిగా చేయవలె నను కొనుచున్నానయ్యా.

వర్త. అప్పును మానికె చిన్నదిచేసినంత మాత్రమున ఎక్కువ లాభము దొరకదు. నాణెమును తూచే తూనికె రాళ్లు కూడా పెద్దవిచేయువలెను.

2 వర్త. ఇది మంచి సూత్రమే దీని నెపుడు చేయగలమయ్యా?

1 వర్త. కీ॥ (ఛాయ-కన్నతండ్రి)

మానిక చి-న్నదగను మన-మెపుడు చేతుమో[3]
తూనిక యందే-ఎప్పుడు - దోచుకొందుమో ॥

2 వర్త. కీ॥ చచ్చు ధాన్యములను[4] - మనము హెచ్చు ధరలకు
ఇచ్చి సొమ్మను ఎపుడు - పుచ్చుకొందుమో ॥

(కొనువాడు బుట్టతో లోపలికి వచ్చును. అతనిచూచి సంభావణ ఆపి)

2 వర్త. మేలు ధాన్యము; మంచి ధాన్యము కొంటారా హోయి!

కొను. అంగడియయ్యా 2 మానికెల గింజలు యిస్తారా?

1 వర్త. 2 మానికెలును 2 రూపాయిలగును.

---

[1]8 : 5. [2]8 : 5. [3]8 : 5. [4]8 : 6.

కోను. అయ్యో దినమంతయు కష్టపడినను ఒక అర్ధరూపాయి సంపాదించ లేకపోవుచున్నాము స్వామీ. 2 మానికెల గింజలకొరకు 2 రూపాయిలు ఎక్కడ తేగలము స్వామీ?

1 వర్త. అంతకు తక్కువ ధరకు దొరకవు.

కోను. (మనస్సులో) హా! యెట్టి కాలము యెదురైనది? (వర్త: తో) పోనిండు, ఈ అర్ధరూపాయి తీసికొని మీదయచొప్పున ఎన్ని యివ్వగలరో యన్నే ఇయ్యండి.

2 వర్త. అర్ధరూపాయికి గింజలమ్మరు.

కోను. అయ్యో స్వామీ మీ కిష్టమువచ్చినన్నే యియ్యండి.

2 వర్త. అర్ధరూపాయి బేరము మాదగ్గర లేదు.

కోను. అయ్యయ్యో! ఈ పూట గింజలు లేవు, పస్తు ఉండుమంటారా?

2 వర్త. ఆ విషయము మమ్ము నడుగబనిలేదు.

కోను. అయ్యయ్యో అయ్యయ్యో! దినమంతయు చెమటలు గార్చి పనిచేసినను ఈ రాత్రి భోజనములేకపోయెనే. అయ్యో అయ్యో! పిల్లలు ఇప్పుడే ఆకలికి యేడ్చుచున్నారే. ఈ అర్ధరూపాయికి నూకలైనా ఇయ్యండి స్వామీ! పిల్లలకు యింత గంజి కాచిపోసెదను.

2 వర్త. ఓరీ పిశాచీ పొమ్ము; ప్రొద్దున్నే దయ్యమువలె పట్టుకొంటివి. (అని కర్రదీసికొని కొట్టబోవుట)

కోమ. స్వామీ స్వామీ! కొట్టకుడు, మీ బానిసను. పోయెదను.
(అని యేడ్చుచుపోవుట)

(ఇద్దరు ధనికులు ప్రవేశింతురు)

1 ధని. ఓయి వర్తకులారా—మీరు బానిసల నెవరినైనా అమ్మగలరా? నేను వేసవికాలముకొరకు ఒక చలువ నగరము[1] కట్టించు చున్నాను. కూలీలు దొరుకుట లేదు. మీరెవరినైనను అమ్మగలరా?

1 వర్త. (లేచి) చిత్తంస్వామీ అమ్మగలము. ఏ ధరకు కొంటారు?

1 ధని. ఒక బానిసవాడు యేమాత్రము విలచేయునయ్యా? ఒక పాదరక్ష యిస్తాము.[1]

1 వర్త అబ్బా, ఒక్క పాదరక్షకు ఒక బీదవాని కొందురా స్వామి! రెండు పాదరక్షలైనను దయచేయురా?

2 ధని ఎందుకు? వెండియిస్తాములే[2] పేదలెవరైనను ఉంటే చూడుము.

ఆమో. (వీటినన్నిటి చూచుచు నిలుచుండి) ఆహా! వర్తకులారా ఎంతటి పాపమున కొడి గట్టుకొనుచున్నారయ్యా! ఆహా! నేను తెకోవ అరణ్యములో నుండగా విన్నది ఇపుడు కన్నది సరిగానే యున్నది. హాహా!!

(3 గ్గురు న్యాయాధిపతులు మాట్లాడుకొనుచు లోపలికి వత్తురు)

1 న్యా. అబ్బా యేమికేసులు యేమికేసులయ్యా!

---

[1] 3: 15, 4: 1. [2] 8: 6.

2 న్యా. ఏమయ్యా? ఆ గిలాదువాండ్లు గర్భదరిద్రులుగా నున్నారే? [1]పది పంటమోపులు తెచ్చుకొనండిరా, కేసు కొట్టివేస్తామని చెప్పినను వారు తేలేమనుచున్నారే!

1 న్యా. తేలేమన్నంత మాత్రమున విడిచిపెట్టరాదు.

(ఇద్దరు కూలివాండ్లు అరుచుచు ప్రవేశింతురు)

1 కూ. మహాప్రభో కరుణించుడు కరుణించుడు.

1 న్యా. ఎవండ్లురా? ఆకాశము అదరునట్లు అరుచుచున్నారు?

1 కూ. మహాప్రభో పేదవాండ్లము పిల్లలు గలవాండ్లము, రక్షించుడు.

1 న్యా. ఏమి? సంగతి యేమి? అధికముగా ప్రేలెదరు.

2 కూ. మహాప్రభో దిక్కులేనివాండ్లము, దరిద్రులము, కరుణించుడు స్వామీ.

1 న్యా. ఓరీ వేషధారులారా పేదవారమని అన్నిసార్లు ప్రేలవలెనా? మీయొద్ద ఆదాయమేమియు లేక నేయున్నదా? సంగతియేమి? త్వరితముగ జెప్పుడు.

1 కూ. చిత్తం మహాప్రభో ఊరిబయట నున్న గుడిసెలలో బ్రతుకు కూలివాండ్లము స్వామీ. రాజుగారి గుర్రములకు గడ్డికోసి[2] అప్పగించుటలో యేలినవారి ఉత్తరువు ప్రకారము యెట్టి లోపమును లేక గతమాసములో

---

[1] 5: 12. [2] 7: 1.

ఎండనక, వాననక, కోసి మా వంతు గడ్డి అప్పగించితిమి స్వామీ. ఈ మాసములో కూడా మమ్మునే కోయుమని కరణంగారు మమ్ము కాల్చుకొని తినుచున్నాడు[1] స్వామీ; ఖామందులవారు తమరు ధర్మకర్తలు, న్యాయం పాలించండి స్వామీ.

1 న్యా. ఏమీ? వారెందుకట్లు సెలవిచ్చిరి?

1 కూ. చిత్తం. మహాప్రభో, పోయిన విశ్రాంతిదినమున మేము మా పితరుల ఆచారము చొప్పున పనికి పోవక తీరికగానుంటిమి స్వామీ. ఆనాడు వారు తమ స్వంతపనికి పంపబోగా, మేము మా పితరుల భక్తిని విడువజాలమని, మా దేవుడైన యెహోవా ధర్మశాస్త్రము మీరజాలమని చెప్పితిమి. అందుకని మాపై కక్ష వహించి యిట్లు హింసించుచున్నారు స్వామీ.

1 న్యా. ద్రోహులారా మీరేమి మాట్లాడుచున్నారు? కరణముగారిపై రిపోర్టు చేయుచున్నారుగా! ఇప్పుడే మిమ్ము ఖయిదులో వేయించెదను. ఓయీ బంటులారా (అని బంట్లను పిలువగా నిద్దరు బంటులు తుపాకులు కత్తులతో రాగా) మీరు వీరిని గొట్టుకొనిపోయి, కోటలోని చీకటికొట్టిలోనికి నెట్టి, గట్టిగా బిగించుడి. వీరేమో మిట్టిపడుచున్నారు, (అని చెప్పెను)

(బంటులు పట్టుకొనిపోవుచుండగా)

1, 2 కూ. మహాప్రభో కరుణించుడు. కూలివాండ్లము గులాపువాండ్లము. బానిసలము. బ్రతుకలేము స్వామీ.

---

[1] 18: 4.

1. న్యా. సోమరిపోతులారా. మీ క్రొవ్వు దీయుంచెదను సుమీ! మారుబలుకకూడదు; జ్ఞానముగలిగి మాట్లాడుడు, అధికముగా ప్రేలకుడు. సభ్యులవైపు చూచి సభ్యులారా నిర్భంధవడ్డీదను అని లేచివెళ్ళును.)

2 న్యా ఓరి పిచ్చివాండ్లలారా జ్ఞానముగలిగి మాట్లాడుమంటే మీకు గ్రహింపు కాలేదా యేమి? యేవో 4 పంట మోపులు యిస్తామని ఒప్పకొనుడి.

2 కూ. స్వామీ ఎక్కడ తేగలము స్వామీ? నిన్నటిదినమున కరణముగారి యింటిదగ్గర నే సరిపోయె. కూలికి పోనందున రాత్రి పస్తు ఉంటిమి. మే మెక్కడ తేగలము స్వామీ? కరుణించండి స్వామి.

3 న్యా. మీకేమియు భూమిలేదా?

2 కూ. 12 ఎకరముల పట్టాభూమియుండగా అంతా అప్పల క్రింద పోయెను స్వామీ; యిక 3 సెంట్ల ముక్క మాత్రమే మా గుడిసెలముందున్నది స్వామీ.

3 న్యా. అది యిస్తామని ఒప్పకొనుడు.

2 కూ. అయ్యో అది మా పితరులు గుడిసెవేసు కొన్న నేల యని దాచుకొంటిమి తండ్రీ! భూస్వాములు ఈ గోరెడు మన్ను తమకు ఎంతభాగ్యము స్వామీ?

3 న్యా. ఆకొంచెము నా కియ్యగలవా? ఈపూట భోజనము కడుపార బెట్టించెదను.

---

15: 12 ... 22: 7.

2 కూ. అయ్యో! అయ్యో! ఒక్క పూట కూటికొరకు నా పిత్రార్జితము అమ్ముకొందునా? అయ్యో!

3 న్యా. పోండు మీ మేలు విచారించి చెప్పినను మీకు తెలియకున్నది.

2 న్యా. పోండు, మిగతి మీరనుభవించెదరు.

2 కూ. (2 కూ. తో) ఈ కేసు తీసుకొని రాకపోయినను మేలుగా నుండును. (న్యా. తో) పోనిండు అలాగే నా భూమిని తీసుకొనుడు (ఆమోను తెరలోపలనుండి)

ఆమో. కీ॥ ఓ యిశ్రాయేలు ఈ మాట విను ఓ యిశ్రాయేలూ
యెహోవా చెప్పే యీ మాట విను ॥ ఓ యిశ్రాయేలూ ॥

1 న్యా. (లోపలికివచ్చి) బైట నెవడో వాగుచున్నాడు. అతనిని లోపలికి పిలువుడి (అని పిలువగా ఆమోసు లోపలికి వచ్చి పాటనంతను పాడుట)

ఆమో. కీ॥ 1. మీరు చేసిన ఘోరకార్యము – మీరుచేసిన నేరంబులను ఎరుంగుదును ॥

2. బీదలయొద్ద పంటమోపులు[1] బీదలయొద్ద బాధించి లాగున్ బలాత్కారమున ॥ ఓ యిశ్రాయేలూ ॥

3. లంచంబులను దోషవృత్తికి[2] – లంచంబులను అంచితంబుగ నందుకొంటిరి ॥ ఓ యిశ్రాయేలూ ॥

అయ్యో వర్తకులారా! అయ్యో ధనవంతులారా!!

---

1. 5: 11, 12.

4. నీతిమంతులన్ ఇక్కట్లు బెట్టి[1] నీతిమంతులన్ - ఘాతు కంబుల్ గావించితిరి ॥ ఓ యిశ్రాయేలూ ॥

5. మంచి యిండ్లను - మలుపురాళ్లతో[2] మంచియిండ్లను - ఎంచి కట్టిన నిల నవి దక్కవు ॥ ఓ యిశ్రాయేలూ ॥

6. కన్య ఇశ్రాయేల్ కూలిపోయెను[3] - కన్యశ్రాయేల్ ఎన్నడైనను లేవజాలదు ॥ ఓ యిశ్రాయేలూ ॥

1 న్యా. (2 న్యా.తో) ఎవడితడు యిట్లు చిల్ల పెంకువలె ముఖము బెట్టుకొని వాగుచున్నాడు? ముఖమున కందిరీగలు కుట్టినాయేమి?

2 న్యా. (1 న్యా.తో) మనలనుగురించియే మాట్లాడుచున్నాడు. ప్రవక్తవలె నున్నాడు!

3 న్యా. (2 తో) మనసంగతి వీనికెట్లు తెలిసినది?

ఆమో. కీ॥ యెహోవా తాను చేయుదానిని - యెహోవాతాను - ఆహో భక్తులకు ఆవని దాచడు[4] ॥ ఓ యిశ్రాయేలూ ॥

1 న్యా (2 తో) యెహోవా యేమో చేయునట?

2 న్యా. (౧.తో) యెహోవా యేమిచేయును? ఆయన మాకే కీడును చేయువాడు కాడే! మాకేమి కీడు కలుగును?

(దాయు - ఇతర దైవముల)

ఆమో. కీ॥ అంగలార్పు - రాజవీధు - లన్నిటిలోను[5] = సంగతివిని అయ్యో యనుచు - భంగపోయెదరు భువిని ॥ అంగలా ॥

(1) పిలుతురికను - సేద్యగాండ్ల బ్రలాపింపను[6] = కలతనొంది యయ్యో యనుచు - కలువరింతు రిలను యికను ॥ అంగలా ॥

1.3: 5: 11, 12. 2: 5: 2. 4: 3: 7. 5.6: 5: 16, 17.

(2) ద్రాక్షతోటలన్నిట రో-దనము వినబడు[1]=సాక్షుత్తుగా మిమ్ముదాటి-సాగిపోయెదను నేను ॥ అంగలా ॥

(3) సైన్యముల యెహోవా సెల-విచ్చునది యిదే - నున్న యైనా పొల్లుయైనా - ఎన్నడైనా తప్పదందు ॥ అంగలా ॥

1 న్యా. (2 న్యాయాలో) ఏమీ యీరోదనము ? మనవీధులలో అంగ లార్పులా? యెహోవా అట్లు సెలవిచ్చెనా? యెహో వాకు మనమీద నంత ఆగ్రహమా ?

1 వర్త. (ం. లో) మా మీద యెహోవాకు ఆగ్రహముండునా ? మేముచాల ఖర్చుచేసి సంతర్పణలు చేయుచున్నామే! బలులను యిచ్చుచున్నామే!

2 న్యా. అవును బలులను క్రమముగా నిచ్చుచున్నాము.

(రాయ పార్వతీసుశ్రీరాజా)

2 వర్త. కీ॥ ఏలను ఆగ్రహము - మా మీద నాయన-కేలను ఆగ్రహము - కాలము దప్పక క్రమముగ బలులను - మేలుగ జేసితిమి - యెహోవాకిలలో ॥ ఏలను ॥

ఆమో. కీ॥ బలులను తెమ్మనడు[2]-మీ యెహోవా - బలులను తెమ్మనడు జలము పారునట్లుజరిపి న్యా - యంబును - ఇలప్రవ - హింప నీయుడి - నీతిని ప్రళయముగా ॥ బలులను ॥

1 న్యా (దిగ్గునలేచి రౌద్రముతో ఆమోసువైపు చూచి) ఏమి వాగెదవు ? ద్వంద్వార్థముగా మాట్లాడెదవు? స్పష్టముగా చెప్పుము. లేనియెడల నిన్నిక్కడనే బంధించెదను.

---

[1] 5: 16, 17. [2] 5 : 22.

ఆమో. కం॥ ద్వేషించుడి కీడు నిక న
న్వేషించుచు మేలుకార్యమెలమిని మీరల్
ఆశించి చేసి బ్రతుకుడి
ఆసైన్యాధిపతి దేవు డండగనుండన్.

3 న్యా. పోనిండు. పల్లెటూరి వానిమాటలు వినులే పొరబాటు. కట్టి మోటువాని నిటకు రానిచ్చుటే చేటు. చాలు చాలు పోదము రండు గుడికిబోయి భజనలైనా చేసుకొందము (అని వెళ్ళిపోవుదురు)

## 2 యాజకుల అక్రమములు

### బేతేలు

(యాకోబు స్థంభమును. అశేరా అను స్తంభము, యారోబాముయొక్క బంగారు దూడ ఉంచబడిన బలిపీఠమును[1] యాజకులు పాత్రల తాళములతోను ధూపములతోను ప్రవేశించుట ; దూడను బలిపీఠము నెదుట నుంచి భజన చేయుట )

(దాయ–జింటాన్ జంటాన్ మరి)

యాజ. క॥ దండం దండం నీకు – దేముడా – మా దండి బేతేలులో
దేముడా – మా – కండ నీవే–మాలండ్రి నీవే – మా కొండ
నీవే – ప్రభుండనీవే ॥ ఓహో దండం ॥

(ఆమోసు నిశ్శబ్దముగా ప్రవేశించుట.)

1 యాజ. (అందరు సాగిలపడియుండగా ప్రధానాచార్యుడు ధూపమువేయుచు మంత్రములను చదువుట )

“ చిత్తబుద్ధిగల్గి చేసిన పుణ్యాంబు
కొంచెమైన నదియు గొదువగాదు

42

విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత
విశ్వదాభిరామ వినురవేమా."

(ఇద్దరు యాత్రికులు మార్గమున పోవుచుండగా.)

1 యాజ. రండి రండి బేతేలుకు రండి భగవంతుని కడకు రండి, భజనలు చేయను రండి.

యాత్రికులీ మాటవిని నిలువబడి ఆశ్చర్యముతో చూచుచుండగా

3 యాజ. కీ॥ ([illegible])

ఆరుగు డిప్పుడే — సరగున బేతేలు పురికి — ఆరుగుడిప్పుడే—
జరుపక నెవ్వరికి,— పరుగున నిచ్చటికి,— ధరలోన నీ గురికి —
మురువుగ నిప్పరికి ॥ ఆరుగుడిప్పుడే ॥

4 యా. కీ॥ నిశ్చయంబే — ప్రభువిచ్చోటు — నుండుననుట — నిశ్చయంబే—
యిక — మెచ్చి మీ దేవుని పేర — హెచ్చుగ నర్పణలను — ఉత్స
వంబులతో నేడే—వచ్చి పూజల జేయుటకు ॥ ఆరుగుడిప్పుడే ॥

2 యాజ. (విగ్రహమువైపు తిరిగి చూచుచూ)

కీ॥ ఓ బేతేలూ—నీవే పుణ్య క్షేత్రమవని — ఓ బేతేలూ—పావన
భూమి యిక నీ — సేవజేయ వచ్చెదము — కావుము మమ్ము
యిక నీ — దేవుండే చిరజీవియా ॥ ఓ బేతేలూ ॥

1 యాజ. రండి రండి త్వరగా రండి బేతేలుకే రండి.

1 యాత్రి. బేతేలుకు యెందుకు రావలెను. యెరూషలేమునకు పోవలెను గదా? మనపూర్వీకుడైన దావీదు దినములనుండి అక్కడనే ఆరాధనలు జరుగుచున్నవి గదా!

1 యాజ. ఇవి దావీదు దినములుకావు. రాజైన రెండవ యారోబాముదినములు. ఆయనకంటె జ్ఞానియెవడు సామర్థ్యుడెవడు! ఆయనతో సాటియెవడు? అషూరు అరాములను అణుగగొట్టి మనకుసిరినిచ్చి, సౌఖ్యమిచ్చి, సమాధానమిచ్చి, పోగొట్టుకొనిన దేశములను తిరిగి స్వాధీనపరచిన యారోబాము సార్వభౌమునికి సాటియెవడు? ఈపురము అతడు యేరి యేర్పరచుకొనిన పురము! రాజప్రతిష్ఠిత స్థలము.[1] బేతేలు నీతి గలది. మన పితరుడైన యాకోబు బేతేలు నేలో గదా దేవుని చూచెను. రండి రండి, సమస్త జనములు బేతేలుకు రండి! నిశ్చయముగా ప్రభువు ఈ స్థలమందున్నాడు. ఓ బేతేలూ నీ దేవుడే నీతిమంతుడు. నీ దేవుడే చిరంజీవి యగు గాక, (అని చెప్పి దూడకు సాగిలపడుదురు)

యాజకులందరు (బిగ్గరగా) రండి రండి బేతేలుకురండి.

2 యాత్రి. అవును అధికారులు ఆజ్ఞనిచ్చినపుడు అభ్యంతరము చెప్పి బ్రతుకగలమా? పోదము రమ్ము (అని 1 వ యాత్రికుడు 2 యా. తో చెప్పి వెళ్లి యాజకులతో కలిసి దూడకును సాగిలపడుదురు.)

1 యాజ (ధూపము వేయుచుండగా మిగిలినవారు అక్కడనే నమస్కరించుచు తేచుచుండురు)

ఆమోసు. (మనస్సులో) అయ్యొయ్యో ఎంతటి అక్రమము! ఇశ్రాయేలీయు లింతటి అక్రమములో నుండగా యెహో

[1] 7: 13.

వాచిత్తమును వీరికి తెలుపక నేనెట్లుండగలను?
(అని చెప్పి యాజకులవైపు దిరిగి)

(చాయ-ఇది దివ్యదేవుని పురమందిరమిది)

కీ॥ ఘనుడైన యెహోవా-ఘర్జన-వినరయ్యా[1]-వినుత సియోనులో-
విపులముగా దాని - వినఁబడజేసెనో హో - హోహోహో
హోహోహో ॥ ఘను ॥

వ॥ ఓ యిశ్రాయేలీయులారా యెహోవా చిత్తమును
తెలుసుకొనుఁడి.

2 యాజ. ఏమి? యెహోవా చిత్తమా? అదియేమి?

ఆమో. కీ॥ ధ్వంసము జేసెద - దమస్కువారిని - ధ్వంసము జేసెద[2] -
హింసలు బెట్టిరి - ఇల గిలాదువారిన్ - క్రొంచమైనను దయ
లేక హోహో హోహో హోహో ॥

1 యాజ. బేష్ యిది బాగానే యున్నది. నిజమే దమస్కు-
ఇంతటితో దుంప నాశనము గావలసినదే. దాని
పొంగు క్రుంగవలసినదే.

ఆమో. కీ॥ ధరఫిలిస్త్రీయులు - చెరగొని కొందరిన్ - ధరఫిలిస్త్రీయులు
కరుణించకెదోము - పరమజేసిరి[3] వారిన్ -బరిమార్చెదనిదుగో
హోహోహోహోహోహో ॥

2 యాజ. ఇది తప్పక జరుగును గాక, ఈ ఫిలిస్త్రీయు లెల్ల
కాలము మనకు ప్రక్కపోటుగానున్నారు. ఆది
కాలములో మన పితరులు ఈ పిశాచులను దేశ
ములో నిలువనిచ్చుటే పొరపాటయ్యె, మంచిది;
చెప్పుము ఇంకా చెప్పుము

[1]1: 1. [2]1: 3. [3]1: 7.

ఆమో. కీ॥ తూరు జనులు సహో-దర నిబంధన-తూరుజనులు సహో-
మీరిరి గనుక ప్రా-కారములందున-కోరినగ్నిని వేసెద[1] నో
హోహోహోహోహోహో ॥

3 యాజ. తూరు ఐశ్వర్యమిక పారిపోవును గాక దానియోడ
లింతటితో పాడగును గాక. దాని చదువు లిక
చతికిలబడును గాక!

ఆమో. కీ॥ ఎదోము తనదగు-సోదరులంపెరిన్ -ఎదోము తనవారన్ -
బాధించి చీల్చెను. బోస్రాపురము నిక బ్రోదిగా గా
ల్చెద[2] నో ॥ హోహోహోహోహోహో ॥

4 యాజ. గర్భములోనుండియే వారు మనకు శత్రువులుగా
నున్నారు. ఇంతటితో వారు అంత మొందుదురు
గాక. భేష్! ప్రవక్తా ఇంకా చెప్పుము నీమాట
అక్షరాల సత్యము.

ఆమో. కీ॥ అమ్మోనీయులు చేయు-అక్రమములకో కై-అమ్మోనీయుల
నిక-నమ్ముడి రబ్బాలో-రణధ్వని వినబడు-ఇమ్మహిన్
దహింతునో[3] ॥ హోహోహోహోహోహో ॥

1 యాజ. ఈ అమ్మోనీయులవలనగాదా మన మతమంతా
చెడిపోయినది. కానిండు, ఈ దఫాతో అమ్మోను
ఎగురునుగాక.

ఆమో. కీ॥ మోయాబు చేసిన-మూర్ఖపు పనులకై-మోయాబువారిపై-
వేయుదునగ్నిని-వేగమే[4] దానిపై-చేయుదు గలిబిలిని-
॥ ఓహోహోహోహోహో ॥

---

[1] 1: 9. [2] 1: 12. [3] 1: 14. [4] 2: 2.

2 యాజ. ఇది మోయాబును గూర్చియేనా? భేష్; మోయాబు ఈ దఫాతో మొదలంట ఎగరవలసి నదే. మనపితరులు మొదట దేశములోనికి వచ్చుటకు వారు మార్గమిచ్చిరా? మన మిక్కుటమునుండు టయే వారికిష్టములేదయ్యో.

3 యాజ. (తనస్నేహితులతో) ఆమోషు పల్లెటూరివాడైన నేమి? ప్రవక్త కాకుండునా? (ఆమోసుతో) ఆమోసూ నీ మాటలు ఏమాత్రము అసత్యముకావు. అవి మాటలుకావు ముత్యాలమూటలు!

4 యాజ బంగారు కణికెలు, కెంపులదండలు. వజ్రపువరుసలు, నీకు శుభమగునుగాక!

2 యాజ. అయితే యూదా రాజ్యముగతి యెట్లున్నదో

3 యాజ. కీ॥ (చాయ-పోయెనయ్యో)

శుభం శుభమయ్యో - సుజ్ఞానాత్మ నీకే - అభయమిచ్చెదము ఆ యూదారాజ్యము గతిని దెల్పు - విభుడేమి చెప్పెనో - వివరముగ దెల్పు ॥ శుభం ॥

ఆమో. కీ॥ పోయెనయ్యో - యూదాకూడాబాసి - శ్రీయెహోవా ధర్మ-శాస్త్రంబులను వారు మీరుచు - ఆయన విధులను - అవనిలో దప్పుచు[1] ॥ పోయెనయ్యో ॥

2 యాజ. వహ్వా! వహ్వా!!

4 యాజ. భేష్! బేష్! భళిరే!

---

[1] 2: 4, 5.

1 యాజ. యూదారాజ్యపు పొంగు యింతటితో క్రుంగక మానదు.

ఆమో. కీ॥ శాంతమిక యూదాపై నేను - చూపను - అంతమొం
దించెద - నందుండు రాజ భ - వంతులన్[1] - వింత
యెరుషలేమును - వసుధ దహింతును ॥ పోయె ॥

3 యాజ. (చప్పట్లుగొట్టుచూ) శహబాస్! శహబాస్!

1 యాజ. (అని పకపక నవ్వుచు) ఆహా హాహాహాహా.

ఆమో. (రౌద్రముతో)

కీ॥ (చాయ—చాలు చాలు చిన్నదొరసు)

మీరు తప్పించుకోన - నేరరు - ఆహా - భూరిదేవుని
తీర్పు ఘోరము - దారిదొలగి మూడునాల్గు - సార్లు
మీరు జేసినట్టి - ఘోరదురిత మెల్ల ప్రభుని - జేరి మొరలు
బెట్టుచుండ[2] ॥ ఆహా ॥

1 యాజ. ఏమీ? మేముకూడా శిక్షనొందుదుమా?

ఆమో. ఇశ్రాయేలు మూడునాలుగుసార్లు చేసిన దోషమును బట్టి నేను తప్పక వారిని శిక్షింతునని యెహోవా సెలవిచ్చుచున్నాడు.

2 యాజ. ఇది మేము నమ్మజాలము. మేము క్రమముదప్పక బలుల నర్పించుచున్నాము. వ్రతదినముల నాచరించుచున్నాము; సువాసనల నర్పించుచున్నాము. దహనబలులను నైవేద్యములను క్రొవ్విన పశువు

---

[1]2: 4, 5. [2]2: 6.

లను క్రమముగా నర్పించుచున్నాము; పాటలు పాడి స్వరమండలముతో జయనాదములను చేయుచున్నాము. దేవుడు మమ్ము నన్యాయము చేయునా?

ఆమో. యెహోవా చెప్పుమాట నాలకించుడి.

సీ॥ కడుహేయముగ నాకు కనబడు జనులార
దండియౌ మీయొక్క పండుగాలి
ప్రతిదినంబులగల్గు వాసన లిక నేను
లేశమాత్రఘ్రాణింప లేనుయిలను
మీరు పాడెడిపాట జేరనియ్యను దరికే
దూరంబుగా దాని బారనియుడి
స్వరమండలపుపాట నరకుజేయను నేను
ధరవానినిక నాపి తడవులేక

తే॥ గీ॥ నీళ్లు బ్రవహించునట్లుగ నెలమి న్యాయ
మేళ్లు బ్రవహించునట్లుగ నీతిజరిపి
మేలు నికజేయవదకుడి మిత్రులారా
ఘాలునికసాపి బయటి యాచారములను.[1]

3 యాజ. ఏమో పిచ్చివాడు అరచుచున్నాడు. పోనిండు. ఎంత గొల్లవానికైనను వేపకాయయంత వెర్రి యుండక మానదు. కావున నీ పిచ్చివానితో నిక మాట్లాడకుందము. రండి రండి (అని తోటివారితో చెప్పి విగ్రహము వైపు దిరిగి)

---

[1] 5 : 21-24.

(ఛాయ - రాకే కంచూతా)

కీ॥ వేతేలు దేవుడిదే - భజనలిచట జేయుదము - వేతేలు దేవుడిదే - చేతనైన బలులనిచ్చి - చేయుదము సంభ్రమములు ॥

1 యాజ. కొంచము ద్రాక్షారసము తెప్పించుడు భజనలు ఉత్సాహముతో చేయుదము.

2 యాజ. దేవుని మందిరము దేనా ?[1]

3 యాజ. అవును అక్కడనే సంతోషించవలెను.
ఓయి, సారాదుకాణము - ఓ సారా మనిషి.

సారాషాపువాడు. (తెరలోపలనుండి) చిత్తం స్వామీ.

3 యాజ. ధరాం. ధిరాం.

సారా. చిత్తం స్వామి హాజరుగా తెస్తున్నాను.

ఏయి విస్కీ-బ్రాంది - సోడా లెమ్నేడ్ వైయిన్ ఎక్స్ట్రా నంబర్ వన్.

3 యాజ. కీ॥ ఛాయ పాపికాశ్రే

తెమ్మ ఓయి ద్రాక్షారసమిా - తక్షణమందే నోయి
తక్షణమందే-నాకిమ్మ దానిపోసి యీనాపాత్రయందే॥

2 యాజ. కీ॥ ఆహా ఆహా ఆరసమును మే-మనుభవింప-నోయి అనుభవింప-మా-స్నేహితులతో కలిసిత్రాగి-సంతోషింప॥

4 యాజ కీ॥ రమ్మురమ్ము త్వరగా ద్రాక్షా-రసముతోను-ఓయీ ఆరసము తోను-ఇక తెమ్ము తెమ్ము ఆపానకము త్వరితముగాను॥

[1] 2 : 8

సారాసాప్రు. (సారాబుడ్డి విప్పుచు)

కీ|| చేరిత్రాగరే – కోరినసారానువేగ – చేరిత్రాగరే –
సురాపానమును – కోరినంతగాను – సారాబ్రాంది వి
స్కీని – సోడా చాంపియన్ బీరుసారా ||

ఆమో. (వారిపాట ముగియకముందే)

కీ|| (ఛాయ—సమయమిదే)

శ్రమలపాలే – ఇశ్రాయేలు – శ్రమలపాలే.

1. జరిమానా ద్రవ్యముతో కొనిన –
ద్రాక్షారసమును త్రాగువారు || శ్రమలపాలే ||
2. జడియక దేవునిమందిరమందే –
తడయక పానముచేయువారు[1] || శ్రమలపాలే ||
3. పానముచేయుచు పరిమళ తైలము –
మేనునబూయుచునుండువారు[2] || శ్రమలపాలే ||
4. మందలో శ్రేష్టపుగొఱ్ఱెలగోయుచు –
విందులజేసి భుజించువారు[3] || శ్రమలపాలే ||
5. క్రొవ్వినదూడలగోసి భుజించుచు –
నవ్వుచు కాలముగడిపువారు || శ్రమలపాలే ||
6. స్వరమండలముతో కలిపిపాటలను –
పరిహాసముతోపాడువారు || శ్రమలపాలే ||
7. భక్తిపరుడు దావీదువలెసేయిక –
భజనలు చేతమురండనువారు || శ్రమలపాలే ||
8. తాకట్టుగబెట్టిన బట్టలను –
తరుణమునందే యియ్యనివారు || శ్రమలపాలే ||
9. బలిపీఠముకడచేరి యితరుల –
బట్టలబరచి పరుండువారు || శ్రమలపాలే ||

[1] ౨ : 8. [2] ౬ : 6. [3] 6 : 4-7.

10. దంతపు మంచంబులపై కెక్కుచు
దేహముచాచి పరుండువారు ॥ శ్రమలపాలె ॥
11. తమయింటికి విచారణజేయుచు
తా మేకర్తలమనుకొనువారు ॥ శ్రమలపాలే ॥
12. బీదలనోటిలో మంటినిబోయను
సాదరముగ నాశించువారు[1] ॥ శ్రమలపాలే ॥
13. దీనులత్రోవకు అడ్డముబోవుచు
కానకతిరుగుచునుండువారు ॥ శ్రమలపాలే ॥
14. అన్యాయపు తీర్పునుజేయను సిం
హాసనములు స్థాపించువారు[2] ॥ శ్రమలపాలే ॥
15. నిర్విచారముగా సీయోనులో
నుండే ఇశ్రాయేలువారు ॥ శ్రమలపాలే ॥
16. ఉపద్రవదినమికదూరముగా
నున్నదియనుచు నుండువారు ॥ శ్రమలపాలే ॥
17. నమ్ముచునా షోమ్రోను గిరులను
నెమ్మదియనుచు నుండువారు ॥ శ్రమలపాలే ॥
18. యెహోవా జనులకు గలిగెడు యీ
ఉపద్రవమును దలచనివారు ॥ శ్రమలపాలే ॥
19. తమదురిచ్ఛలచే దేవుని నా
మము అవమానము పరచువారు ॥ శ్రమలపాలే ॥
20. శ్రమశ్రమ యికశ్రమ
షోమ్రోనుకుశ్రమ–అమితపుశ్రమ యిక అవనిలోవారికి ॥

1. యూజ. ఎవడితడు ఇట్లు వాగుచున్నాడు?

ఆమో. అయ్యోయ్యో ఎంతటి అక్రమములు! నీతియే నేల గూలెను! భక్తి యీ బుగ్గిలో గలిసెను! ఆరాధనలా అపహాస్యమాయెను! శాస్త్రములు శూన్యమాయెను!

---

[1] 5 : 11 12. [2] 6 : 1–8.

**ఆదికాలపు కృతము ఊది వేయబడెను! బాహ్యారాధనలు బలువయ్యెను! తిరుగుబాటు మోపయ్యెను!! ఆహా ఎంత తిరుగుబాటు!!!**

ఆమస్యా. (మహా రౌద్రముతో పరుగెత్తివచ్చి)

కీ॥ ఎవడిలడు యిట్లుబలుక - నింతగా సాహసించే
భువిని యిట్టిది తిరుగు - బాటుయని చెప్పుటకు ॥ ఎవడి॥

ఆమో. కీ॥ తిరుగుబాటు చేయుడి యీ - ధర బేతేలును జేరి[1] -
మరియెక్కువ గిల్గాలు - పురమునజేరియిక ॥ తిరుగు ॥

ఆమస్యా. వీని నిచ్చట కెందుకు రానిచ్చితిరి?

(చాయ - అమలవిమల కమలనయన)

కీ॥ జారా నీవెవడవు మము-అవమానపరచను ఓరీ వెర్రిగొల్ల
అవనిమేము చేయుయిట్టి - ఆరాధన వ్యర్థమన -
భువినియిట్లు పొగరించి - పలుకనీకే చెల్లునౌరా - ఓరీ
ఓరీ ఓరీ వెర్రిగొల్ల ॥ అవ ॥

ఆమో. కీ॥ లడవులేక తిరుగుబాటు - పుడమిలోనిక జేయుడి
ఆ - హా - యిశ్రాయేల్ - మూడుదినములకొకసారి -
మురుసుకొనుచు నర్పణలను - నేడుదశమభాగములను -
వేడుకతో నివ్వరండి. ఆహా ఆహా-ఆహా యిశ్రాయేల్ ॥

ఆమస్యా. కీ॥ పుడమిలోనిది తిరుగుబాటని - పోతరించి పల్కెదవు
ఓరీ ఘోరపాపి - గడుచుతనము చూపెదవు - కడుహేళనజేసెదవు - పడుచుతనము చూపెదవు - పంతగించి
పలికెదవు - ఓరీ ఓరీ ఓరి ఘోరపాపి ॥

---

1. 4: 4, 5.

[1] ఆమో. కీ॥ దినదినము బలులను పులి - సిన పిండితో నర్పణల్ -
ఆహా యిశ్రాయేల్ - ఘనస్తోత్రార్పణలనిచ్చి - కొని
యాడుచు చాటు డి-తనివిదీర స్వేచ్ఛార్పణ లను ఇయ్యాడి
మనస్సుదీర-ఆహా, ఆహా, ఆహా ఇశ్రాయేల్ ॥ తడవు ॥

వచ. ఇశ్రాయేలీయులారా ఈలాగున చేయుట మీకిష్టమైనది. నాకు దహనబలులను నైవేద్యములను మీరర్పించినను నేను వాటిని అంగీకరింపను. సమాధాన బలులుగా మీరర్పించు క్రొవ్వును నేను చూడను. ఇశ్రాయేలీయులారా అరణ్యములో[1] 40 సం॥ లు నాకు బలులను నైవేద్యములను మీ రర్పించితిరా? హా. ఇశ్రాయేల్.

అనుస్యా. పోదమురండు యిక నీపిచ్చివానిమాటలకు చెవి నొగ్గకయుందము.

(అందరును వెళ్ళిపోవుట)

సాధువుల సంభాషణ

శిష్యు. స్వామీ ఈ కథభావము నా కెరింగించెదరా?

గురు. శిష్యా "భక్తిలేనిపూజ లేమిటికి" యని బుద్ధిమంతులైన పెద్దలు చప్పినట్లు మనుష్యుల ప్రవర్తన సరిగానుండనపుడు వారిపూజలెవరికి గావలెను? బ్రతుకు సరిగానపుడు వారు బడికిపోయిన నేమి, గుడికిపోయిన నేమి? భగవంతుడు బయటి ఆరాధనలతో మోస

[1] 5: 24, 25.

పోవునా? మనుష్యులు తమ మాయోపాయముల చేత భగవంతుని మోసపుచ్చయోచింతురు. తమ బాహ్యారాధనల చేత నాయనను భంగపువ్వ జూతురు. కానుకలిచ్చి కంటిలో దుమ్ముపోయజూతురు. చందాలిచ్చి సంతోషపరచ జూతురు. సంస్కారములతో సమ్మతిపరచగోరుదురు. గాని భగవంతుడు వీటిచే మోసపోవునా? భాగవతము సప్తమస్కంధములో నేమి చెప్పియున్నది!

> క॥ "చిక్కడు వ్రతముల గ్రతువుల
> జిక్కడు దానముల శౌచశీలతపముల
> జిక్కడు వృత్తిని భక్తిని
> జిక్కినక్రియ... సిద్ధమునుండీ."

శిష్యబ్రతుకు ప్రధానముగాని బాహ్యాచారము ప్రధానము కాదు? నవ్యవేద కోలాహలమందు

> సీ॥ "మ్రానుచుట్టునుదిరుగ మంచిదని నుతియింపగానుగ
> యెద్దేమిగనియెతిరిగి। తలబోడియైనను తత్వజ్ఞుడేనియు
> తలబోడిపడుచు తత్వజ్ఞురాలె"

కండ్లుమూసికొని రావిచెట్టుచుట్టు మూడుసార్లు తిరిగిన యెడల పుణ్యముదొరికెనేని కండ్లు గంతలుగట్టిన యెద్దు గానుగ చుట్టు దినమంతయు దిరుగునే! దానికిని పుణ్యము అధికముగా గలుగదా! అయిననేమి మేమే దేవనిజములమని చెప్పి దినమునకు ముమ్మారు మోకరించుచున్నారు. గాని హృదయము అన్యాయముతోను దుర్నీతితోను నిండియున్నది. మోసములు దురాశలు మానవ హృదయమునుండి తొలగి

పోలేదు. దేశముబలువైనది. భక్తిశూన్యమైనది. శిష్యానీతి యే దేశము నుద్ధరించునది యని నమ్ముము. నీతియే భగవంతుడు కోరునదియని యెరుంగుము. దేవుని రాజ్యమును ఆయన నీతిని వెదకుము. శాస్త్రులపరిసయ్యుల నీతికంటె మననీతి అధికము కావలెనని ఎరుంగుము.

ఓ నీతిమంతా, భగవంతా, శ్రీమంతా, సత్యవంతా, ఓ న్యాయవంతా, పుణ్యవంతా, దీర్ఘశాంతా, బలవంతా పాపరహితా పాహిమాం. పాహిమాం.

# నాల్గవ రంగము

## బేతేలులోని చివరిబోధలు

(యాజకులు ఆరాధికులును మద్దెలతాళములతో భజనచేయుచుండగా లోపలికివచ్చుట)

పా॥ (దాయు—చూడుమో కయిఫా)

నిర్వికారా నిరంజన నిన్నెనమ్మితి

**యాజకులు.** యెహోవాదినము యేతెంచుచున్నది ఒహో - యెహోవా దినము - ఆహా ఆదినమునందు - ఆనందమొందుచు - మహాదేవుని పేరు మదిలో దలంచుచు - ఓహో సంతోష నదిలో - ఓలలాడుచుందుము - వహావ్వా యది దలచ మాకు - బహుధైర్యమే ఆహా ॥ యెహోవా ॥

**ఆమోను.** (లోపలికివచ్చి నెమ్మదిగానుండి వారిపాట ముగియకముందే)

పా॥ యెహోవాదినము - మీకేమిలాభము - ఒహో - యెహోవాదినము - యెహోవాదినముకొరకు యెదురు చూచినందున - ఆహా యేలాటి లాభ-మవనిమీకు గలుగదు - మహా గాఢాంధకార - మయమై అది యుండును - ఒహో వెలుగెంతమాత్ర - మెలమి మీకు కలుగదు - మహాశ్రమలెన్నో మీ - మీదికొరగి పడుచును - బహు - దుఃఖపు శ్రమలు భువిలోనిక గలుగును-ఆ - హాహా ఆ దినము మీకు - అమితదుఃఖమే[1] - యిక ॥ యెహోవాదినము ॥

ఇశ్రాయేలు యింటివారలారా ఆలకించుడి. యెహోవా దినము ఏతెంచుచున్నదని ఎరిగి చంకలుగొట్టుకొనకుడి. ఆ

---

[1] 5 : 17-20.

దినమున మీకేమో మేలుకలుగునని భ్రమపడకుడి. ఒకడు సింహామునుండి తప్పించుకొనగా ఎలుగుబంటి ఎదురైనట్లుండును. ఇంటిలోనికిపోయి గోడమీద చేయివేయగా పాము కరిచినట్లుండును. ఓహో ఆ దినమున మీకు వెలుగు యెంత మాత్రమును కలుగదు. కారుచీకటులు మిమ్మును కమ్మును. కారుచీకటిలో ఆరాము ఎలుగుబంటి మిమ్ము నెదుర్కొని తన గోళ్లతో మిమ్మును రక్కి చీలికలుగా చీల్చి చంపునని నమ్ముడి.

3 యాజ. అందుకని నీవు ఇప్పుడు చెప్పునది యేమి?

ఆమో. (చాయ-పిలచినపలుకవేమి)

కీ॥ మేలును ప్రేమించుము - ఇశ్రాయేలు - కీడును ద్వేషించుము[1] - నీళ్లుపారునట్లు - న్యాయము జరుపుచు - ఏళ్లప్రళయరీతిన్ - నీతిని జరిపి ॥ మేలును ॥

ఆమస్యా. కీ॥ చాలునిక - నాపుము నీమాటలను - చాలునిక నాపుము మేలులజేయుమాపాలిట దేవుడు - చాలదయనుజూచునమ్మన్నడు ॥

ఆమో. ఇదుగో యెహోవా మట్టపుగుండు నొకటిని ఇశ్రాయేలు మధ్యను వేయనైయున్నాడు. ఆదియారోబాము ఇంటిమీదపడును. ఇస్సాకు ఉన్నతస్థలములు పాడగును.[2]

ఆమస్యా. (మహాక్రోధముతో) మహారాజైన యారోబాము పేరెత్తుచున్నావే! యేమీ. రాజద్రోహమా? ఇంతవర

---

[1] 5: 14, 24. [2] 7: 7-9.

కును మతద్రోహముకొంటిని గాని చివరకు
రాజద్రోహము చేయుటకు సాహసించితివే !!

సేవకా సేవకా (అని సేవకుని పిలుచుచు)

సేవ. చిత్తముస్వామీ (అని వంగినమస్కరించుట)

అమస్యా. ఆమోసు చాలా కుట్రమాటలు పలుకుచున్నాడు. ఇది రాజుకు తెలుపవలసియున్నది. త్వరగా కలము సిరాబుడ్డి తెమ్ము.

సేవ. చిత్తంస్వామీ (యని నమస్కరించి పరిగెత్తివెళ్ళి కలము సిరాబుడ్డి తీసుకొనిరాగా)

అమస్యా. ఇది కేవలము రాజద్రోహము దీనివిడిచిపెట్ట వీలు లేదు. (అంత వస్యాన వ్రాసి చదువుట)

మహారాజరాజశ్రీ, రాజమాన్య రాజమహా పూజితులై చిరంజీవులై ఇశ్రాయేలు రాజ్యమునకు మహా చక్రవర్తులై సమస్తవైభాగ్యభోగ్యములతో నేకచక్రముగ నేలుచున్న శ్రీశ్రీశ్రీశ్రీ మహారాజశ్రీ రాజైన రెండవ యారోబాము సార్వభౌముని సన్నిధికి అర్చకుడైన అమస్యా అనేక సాష్టాంగ దండప్రణామంబు చేసి వ్రాయునది.

ఇశ్రాయేలీయులమధ్య ఆమోసు నీమీద కుట్రచేయుచున్నాడు.[1] యారోబాము ఖడ్గముచేత చచ్చుననియు, ఇశ్రాయేలీయులు తమ దేశమును విడిచి చెరలోనికి పోవుదురనియు ప్రకటించుచున్నాడు. ఆతనిమాటలు దేశము సహింపజాలదు.

ఇట్లు వ్రాయునది
బేతేలులోని యాజకుడైన అమస్యా.

---

[1] 7: 10.

సేవకా దీని త్వరితముగా దీసికొనిపోయి రాజుకు అందిమ్ము. (అని సేవకునితో చెప్పగా సేవకుడు ఉత్తరమును దీసికొని పరిగెత్తును)

(ఆమోసు వైపుదిరిగి) దర్శకుడా ఇక నీబోధనాపి పారిపొమ్ము; లేనియెడల నీకు ముప్పువాటిల్లును.

(ఆమోసు వెళ్లక అక్కడనే నిలువబడియుండుట అమస్యా కోపముతో ఆమోసు వైపుచూచి) ఏమి మొద్దువలెనే కదలక యున్నాడు!

ఆమస్యా. కీ॥ (చాయ—పోపొమ్ము ఓలోకమా)

సరగున పారిపొమ్ము - యూదాదేశ పురమునకు పొమ్ము -
మురువుగ నీవార్త - పురమున చాటినీ - కొరకు బత్తెము
గై - కొనుము ఆ పురమునందే[1] ॥ సరగున ॥

ఆమో. కీ॥ కాను నేను ప్రవక్త - ప్రవక్తయొక్క - పుత్రుడనైనకాను[2]
దీనపశువుల మేపు - కొనుకాపరిని - ఏను పండ్లు గ్రుచ్చు -
కొని జీవించువాడ ॥ కాను నేను ॥

ఆమస్యా. కీ॥ బేతేలు రాజు పురము - యారోబాము ప్రతిష్ఠితస్థలము -
నీతిబోధలైతే - నీదేశమున జెప్పు - మిది శ్రేష్ఠ రాజధాని -
ఇట నీవు చాటవలదు ॥ సరగున ॥

ఆమో. కీ॥ మందలను గాయుచుండగా - యెహోవా నాకు - పొందు
గా పిలవిచ్చెను[4] - ముందుగా ఈనాజను - లందరితో నీ
వార్త - తొందరగా జెప్పు - మందునంచు బంపె ॥ కాను
నేను ప్రవక్త ॥

ఓ యాజకుడా యెహోవా చెప్పుమాట నాలకించుము.

---

[1]7 : 12. [2]7 : 14. [3]7 : 15.

సీ॥ నీభార్య నిజముగా నీపురమందున్నవే[1]
నాశనంబగునని నమ్ముమయ్యా
నీభూమి త్వరలోన నిజముగా నూలుచే
భాగింపబడునయ్యా పరువులేక
అన్యులుండెడిదేశ మందున నీచావు
విపరీతముగవచ్చు వినుముయయ్యా
శత్రువు యేతెంచి సంచరించుచును నీ
ధాత్రిని నీప్రభన్ తరుగజేయు

తే॥ గీ॥ ఇశ్రయేలులో నగరులు యికనుపాడు
ఇశ్రయేలుచెరకుబోవ నిలను నిజము
సేనలయెహోవ సెలవు యీతీరునుండ
సత్యమిదినమ్ముమయ్యా యీ సరణిలోను.

4.3యాజ. కీ॥ ఆగుఆగుము ఆగవోయి – బాగుబాగది యాగవోయి –
జాగులేకను బోధనాపి – సాగవోయి నీ చోటికి ॥

కీ॥ ఇశ్రాయేలు యింటిసంగతి – ఇచ్చట బోధింపక –
నాశ్రయంబగు చోటువిడకి – యచ్చట నదివాగవోయి॥

ఆమో. కీ॥ (చాయ–ఏలమీరలిచట)

యెహోవా నన్నిటకు – నెంచి పిలిచినాడు[2] – మహా
వా – క్యాలను జెప్పు – మనుచు బంపినాడు – అహా
యెహోవానాజ్ఞ అవనిమీరజాల – నోహో ఇశ్రాయేలు
ఒప్పుగా నెరుంగుము ॥

కీ॥ బొబ్బరించ సింహంబు – భయపడనిది యెవ్వడు –
ప్రభువు యెహోవ ఆజ్ఞనియ్య–ప్రవచింపనిది యెవ్వడు–
అబ్బో యెహోవానాజ్ఞ అవనిదప్పజాలదు – దబ్బున
ఇశ్రాయేలు తేటగా నెరుంగుము ॥

[1]7 : 17. [2]7 : 15.

4 యాజ. ఇట్టి అబద్ధములు ప్రవచించుట ఎక్కడ నేర్చు కొంటివయ్యా.

(చాయ–చింతించకుమా)

ఆమస్యా. కీ॥ ప్రవచింపకుమా – ప్రవక్తా యీలాటివార్త – ప్రవచింపకుమా – నివహమందున – నీలాటి య – సత్యవార్త ॥ ప్రవచిం ॥

ఆమో. కీ॥ ఎరిగించెదను యెహోవా – సెలవిచ్చుమాట ఎరిగించెదను– ధరనిశ్రాయేల్ – వారి – దురితము లికమరువబడవు ॥

ఆమస్యా. కీ॥ ఓదుర్మార్గా – వసుధలో నీచెడ్డవార్త – ఓదుర్మార్గా – బోధించకుమా – భువిలోను ఈచెడ్డవార్త ॥

ఆమో. కీ॥ భూమికదులును పైకుబుకు నీటియూటలన్ని – భూమి కదులును ఆమహాదినమందు అస్తమించు సూర్యుడికను[1] ॥

ఆమస్యా. వీడు మనకు పీడాకారముగా నున్నాడె! పొమ్మనగ పోడు. ఊరకుండి మనగా నూరుకోనడు. (అనిచెప్పి ఆమోసువైపుతిరిగి) ఓ దుర్మార్గా యింక నీ బోధ నాపని యెడల పరువుదక్కదు సుమా!

ఆమో. కీ॥ (చాయ–సగుణధామ సుందరిసామి)

వినుడి యెహోవా సెల – విచ్చుమాటను – ఘనుడైన ఆ – యెహోవమాటము ? = వినుడి మీకన్యకలు య – పనులందరును – పెను దప్పికచే – తను కూలుదురు[2] ॥

(b) మీరు పోయి కర్మెలులో చేరిదాగినన్ –
చేరి[3] మిమ్మును వెదకి కోరితెచ్చెదన్ –

---

[1]7: 7–9. [2]8: 13. [3]9: 1–4.

మీరు సముద్రములో మునిగి దాగినన్ -
(1 యాజ) ఓరీ నీ కావడవు మితిమీరి వాగెదవు
ఘోరసర్పము మిము చేరికరుచును -
(2, 3 యాజ) కారుకూతలనిట్లు కూయబోకుము ॥

(c) చెరకుబోయినప్పటికిని - చేరివత్తును,
(4) సరిసరియిక బోధనాపి సరగనరగరా -
ధరఖడ్గముచే మిమూ ధ్వంసముజేతు.
(అమ) పరువుడక్కదు యిక పరుగునెత్తుము.
మరువక నిక కీడుకేమీ వెంటనుందును -
(అ) సరియిదివిననోపజాల సగరనరగరా -
ధరనిశ్రాయేల్ నిను బరిమార్చెదను.
(4) త్వరగనరగరా నిన్నుతరిమికొట్టెదన్ ॥

ఆమస్యా. నిన్ను నీవు రక్షించుకొనగోరినయెడల పారిపొమ్ము. త్వరగా పారిపొమ్ము.

ఆమో. (గొప్పశబ్దములో) ఈ మాటవినుడి. ప్రభువైన యెహోవా కన్ను ఈ పాపిష్ఠిరాజ్యముమీద నున్నది.[1] దానిని భూమిమీద నుండకుండ నాశనము చేతును. నాజనులగు ఇశ్రాయేలీయులు వేసవికాలపు చివరికాపువలె కోయబడుదురు. లెక్కలేని శవములు! ప్రతి స్థలములోను[2] అయ్యో! అయ్యో!! అయ్యో!!!

3 యాజ. (ఆమోసు తనమాటలు ముగింపకముందే ఏమీ యనుచు మీదికివచ్చి కొట్టబోవుట ఆమస్యా అడ్డముబోవుట)

---

[1] 9: 9 [2] 8: 3

(బాయి-ప్రముక్క-రేరబొమ్మలు)

ఆమో. కీ॥ సిద్ధపడుము ఇశ్రాయేల్[1] – సద్దులేకయికను త్వరగా –
సిద్ధపడుము ఇశ్రాయేల్ – ఇద్ధరలో మీదేవుని – యొద్ద
కనబడుటకు త్వరగా ॥ సిద్ధపడు ॥

**గుంపంతయు.** (గళిబిలిగావచ్చి)

కీ॥ కొట్టరేరవీనిని – గట్టిగా మీకర్రలతో – కొట్టరేరవీనిని
నెట్టికట్టి – కొట్టివాని – తిట్టిశ్రమలు పెట్టినేడే ॥
కొట్టరేర ॥

(కొట్టె పారిపోవుట అమోను పశివాయి నెమ్మదిగా లేచి బట్టలు దులుపుకొని లేచిపోవుట తెరపడును.)

## గురు శిష్యుల సంభాషణ

శిష్యుడు. స్వామీ యేమి యీచిత్రము ?

గురువు. శిష్యా మనుష్యులలో కొందరు తాము దేవుని జనులమని విఱ్ఱవీగుచున్నారు. తాము దేవుని జనులైనంతమాత్రమున దేవుడు తమ్మును చంకనెత్తుకొనునని సంతోషించుచున్నారు. తాము యెట్లు బ్రతుకుచున్నను దేవుడు దానిని చూడక, తమ్మును ఎంచుకొన్నందున తమమీద దయ చూపకమానడని భ్రమపడుచున్నారు. గాని భగవంతుడు పక్షపాతములేనివాడను సంగతి నెరుగకపోవుచున్నారు. ఆయన శిక్షించుటలోను హెచ్చించుటలోను అందరిని సమానముగానే చూచునుగాని

[1] 4: 12

పక్షపాతము వహించదు. ఆయన తన నీతినే ప్రమాణముగా పెట్టుకొనునుగాని మనుష్యాభిప్రాయములను ప్రమాణములుగా పెట్టుకొనదు. ఒకజనమును తాను యెంచుకొన్నప్పుడు వారి ప్రవర్తన చెడ్డదయ్యేనేని వారిని యెక్కువగా శిక్షించునేగాని తక్కువగా శిక్షించదు. తెలియక తప్పుచేసినవానికి తక్కువ దెబ్బలు తగులునుగాని తెలిసి చేసినవానికి ఎక్కువ దెబ్బలు తగలక మానవు. విశేష కృప విశేష ఉత్తరవాదమును గలిగియున్నది. అయినను మనుష్యులీ సత్యమును మనస్సునబెట్టక పోవుచున్నారు శిష్యాహా!

ఓ భగవంతుడా, పరమదయానిధీ, కరుణాకరా, కృపామయా నమస్తే నమస్తే.

(సాధువులు వెళ్లిపోవుట)

# అయిదవ రంగము

## ఆమోసు మరణము

(గొల్లలు చలిమంట కాగుచుండగా ఆమోసు చాలా అయాసముతో వారియొద్దకవచ్చుట)

1 గొల్ల. ఆ వచ్చేది యెవరు?

2 గొల్ల. ఆమోసువలె గనబడుచున్నాడు!

3 గొల్ల. ఆమోసే - ఆమోసే! (అని లేచుట)

4 గొల్ల. ఆయాసముతో వచ్చుచున్నాడే!

1 గొల్ల. ప్రయాణాయాసమై యుండును!

2 గొల్ల. లేదులేదు దవడవాచినదే!

3 గొల్ల. చేతికేదో కట్టుకట్టినట్లున్నది!

4 గొల్ల. అబ్బా! తలరక్తము కారుచున్నదయ్యా!!

1 గొల్ల. అయ్యో యెవరో ఆమోసును కొట్టినారయ్యా!!

2 గొల్ల. అయ్యో అయ్యో అంతటి ఘాతుకు లెవరయ్యా!!

3 గొల్ల. అయ్యయ్యో, ఆమోసూ—వీపు చిట్లినదయ్యా!!

4 గొల్ల. అయ్యో కర్ర దెబ్బయై యుండును!!

1 గొల్ల. కొంచెము జలము తెండయ్యా!!

2 గొల్ల. ప్రక్కపరువండయ్యా!!

3 గొల్ల. పరుండుము ఆమోసూ!!

4 గొల్ల. కట్టుకట్టుదును స్థలమీయుడి!!

(నెమ్మదిగా కట్టుకట్టినపిదప)

1 గొల్ల. చేతిలో యేదో తోలుచుట్ట ఉన్నట్టున్నదే!!!

2 గొల్ల. దీనిలో నేమో వ్రాసియుంచినాడయ్యా!!!

3 గొల్ల. చదువండయ్యా!!!

4 గొల్ల. చదివెదను.—ఇశ్రాయేలు రాజైన యరోబాము దినములలో ఇశ్రాయేలునుగూర్చి తెకోవపనుల కాపరులలో ఆమోసు అనునొకనికి కనబడినదర్శనము.

ఆమో. (ఆమోసు కష్టముతో మాట్లాడుచుండగా ఒకగొల్లడువానిచూచి ఒక్కొక్కమాట చెప్పును; రెండవగొల్ల వ్రాయును.)

ఇశ్రాయేలు యెహోవా సెలవిచ్చినదేమనగా...... మీరు నన్ను వెదకుడి......అప్పుడు మీరు బ్రతుకుదురు...... కీడును ద్వేషించుడి......మేలును ప్రేమించుడి......నీళ్లు పారునట్లు న్యాయమును జరుగనియ్యుడి......గొప్ప ప్రవాహమువలెనే......నీతిని ప్రవహింపనీయుడి.[1]

2 గొల్ల. (వ్రాసి చదువును)

ఆమో. (పాన్పుమీదనుంచి కొంతసేపు లేచి ఆకాశమువైపు చూచి)

[1] 5: 14, 24.

సప్తఋషి నక్షత్రములను మృగశిర నక్షత్రములను సృష్టించినవాడును పగటిని రాత్రిగ మార్పుచేయువాడు నైన యెహోవాను వెదకుడి. (అని చెప్పి పడుండును)

3 గొల్ల. ఆమోసూ నీకెందుకు ఇట్టి యవస్థలు? నీవు మాట్లాడక ఊరుకొనరాదా?

4 గొల్ల. అబ్బా-ఊరుకొనడయ్యా!

ఆమో. (ఏదో చెప్పబోవుచు లేవలేకయి తిరిగి పడిపోవుచు ఆకాశమువైపు చూచుచు)

యెహోవా... యెహోవా నన్ను పిలిచెను... ...
యెహోవాయే ఆయననామము (అని చేతులు చాచుచు కండ్లుమూసి చనిపోయినట్లు[1] నటించును)

(తక్కిన గొల్లలు అతని కాళ్లు చేతులు కండ్లను సద్ది శవమును సరిచేయుదురు)

1 గొల్ల. (లేచి తన చేతిలోని చర్మపుచుట్టు పట్టుకొని శవము నెదుట నిలువబడి బహు విచారముతో చదువును)

ఇశ్రాయేలు రాజైన యరొబాము దినములయందు ఇశ్రాయేలీయులనుగూర్చి తెకోవలోని పశువుల కాపరులలో ఆమోసు అను నొకనికి కనబడిన దర్శన వివరము:—

కీడును ద్వేషించుడి - మేలును ప్రేమించుడి
నీళ్లు పారునట్లు న్యాయమును జరుగనియ్యుడి
గొప్ప ప్రవాహమువలెనే నీతిని ప్రవహింపనియ్యుడి.

అతనిని యెహోవా తీసికొనెను. యెహోవాయే ఆయన నామము.

(తెర పడును)

---

[1]హెబ్రీ 11: 37,

# మంగళార్చన

(అందరుకలసి పాడుదురు)

(72 కీర్తనల ఛాయ - భయపడకుడీ బోయులారా)

1. దేవా మా - యేసుపేర - నీవనుఘను దీవెనలతో - బ్రోవ నిపుడు బూనియుంటివా - భావమందు లేనందున - భగవంతుని నిజజ్ఞానము - జీవపథము - విడుచుచు పెడ - త్రోవలనే త్రొక్కితిమి ॥ దేవా ॥

2. కలుగనీకను - బల్మునెమ్మది - ఇలజనులకు - కలకాలము - వెలలేని = యేసునీతిచే - పలుమూర్ఖా - చారములచే - నలిగిన జ - నులకెల్లను - సలలితముగ క్షేమ - మొసగు శ్రీయేసుని నామ మహిమ ॥ దేవా ॥

3. సకలజనులు - సంతసించి - స్వామి యేసుక్రీస్తుప్రభుకు - స్తుతియర్పణ లను దెచ్చెదరు - అకళం - కుని పూజిం - చితమను నె - మ్మది గలిగె ననుచు - ప్రకటింతురు జగమంతట - నికనాయన దేవుడనుచు ॥ దేవా ॥

4. ఎల్లవేళలందు యేసుని - చల్లని కృప దలచుకొనుచు - నుల్లమందు సంత సింతురు - కొల్లగా నాయేసు ప్రేమ - కొనియాడుచు దీవింతురు - ఎల్లకాలములందు యేసు - యేలుచుండు - నెల్లజనుల ॥ దేవా ॥

5. స్తుతి గలుగును - అతిముదమున - సతతము స - ర్వోన్నతునికి - ప్రతి దేశమునందు భక్తితో - పితా సుతా ఆత్మలకును-అతి మహిమలు గలుగు ననుచు - ప్రతివారును పాడునికను - క్షితినతి శుభమంగళములు ॥ దేవా ॥

(తెరపడును)

శుభము

MADRAS—1925